ఓం

శ్రీ గురుభ్యోనమః

# గురువాక్యోపనిషత్తు

(భావార్థ వివరముల సహితము)

సంకలనకర్త

శ్రీ ప్రబోధానంద మల్లు వెంకటరెడ్డి దేశిక ప్రభువుల

ప్రియ శిష్యుడైన

**మంత చిన్నయ్య**, ఎం.ఎ., బి.యిడి.

రిటైర్డ్ జూనియర్ లెక్చరర్.

శ్రీ మద్రామడ్గు శివరామదీక్షిత అచల గురూప పీఠము

రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్ - 509 001.

శ్రీరామ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, యం.నగర్. ఫోన్ : 46937.

ఓం

శ్రీ గురుభ్యోనమః

# గురువాక్యోపనిషత్తు

(భావార్థ వివరముల సహితము)

సంకలనకర్త

శ్రీ ప్రబోధానంద మల్లు వెంకటరెడ్డి దేశిక ప్రభువుల

ప్రియ శిష్యుడైన

**మంత చిన్నయ్య,** ఎం.ఎ., బి.యిడి.

రిటైర్డ్ జూనియర్ లెక్చరర్.

ప్రథమ ముద్రణ : 2001 ప్రతులు : 500

వెల : 10/-

శ్రీ మద్రామడ్గు శివరామదీక్షిత అచల గురూప పీఠము

రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్ - 509 001.

# గురువాక్యోపనిషత్తు

శ్లోకాను క్రమణిక పుట సంఖ్య



**అనుబంధము :**

ఓం

శ్రీ మదచలర్షి సాంప్రదాయక బృహద్వాశిష్ఠ సిద్ధాంత

శ్రీ మద్రామదుగు శివరామ దీక్షిత

గురూపపీఠ రాజయోగాశ్రమము, రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్.



మద్గురువులు

**శ్రీ మదచల ఋషి ప్రబోధానంద మల్లు వెంకటరెడ్డి దేశిక ప్రభువులు**

శ్లో॥ పరిపూర్ణానంద నర్సింహార్య పాదకమల సేవకం ।

ప్రబోధానంద వెంకటార్య సద్గురు భజామ్యహం ॥

శ్రీశ్రీ శివరామదీక్షిత అచల గురూప పీఠము
రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్

# అభిప్రాయము

ప్రపంచమున ప్రతి ప్రాణి దుఃఖనివృత్తిని సుఖ ప్రాప్తిని గోరుచుండును. సుఖమును పొందుటకై తన శక్తి కొలది వస్తు సంపదను కూర్చుకొనుటకు ప్రయత్నించును. కాని ఏ వస్తువు నందు శాశ్వత సుఖము లేదు. నిజ స్వరూపజ్ఞానము కలిగినపుడే దుఃఖనివృత్తియై శాశ్వత సుఖము లభించ గలదు. అధికులు దృశ్య ప్రపంచమున యోన్నోవస్తువులను చూచి వాటి ఆకర్షణలోబడి దానిని పొందుటకు యెంతో శ్రమకు లోనగుదురు. "యదృశ్యం తద్ నశ్యం" యను లోకోక్తి (శ్రుతి) ని దృఢముగా నమ్మక క్షణిక సుఖముల కొరకు (అనిత్యములైన వాటి కొరకు) ప్రయత్నించి అశాంతని పొందుదురు. దీనికి భిన్నముగా మనోదృక్కుచే బాహ్యాదృశ్యములను విస్మరించి అంతరంగమందు ఆత్మపరిశోధన చేయువారు చాల అరుదు. ఈ గ్రంధమునకు తాత్పర్యములు వ్రాసి, వివరణములు కూర్చిన వారు ఈ కోవకు చెందిన వారు. తాను సత్సంఘమున, లేక పెద్దలచే విన్న దానిని ఏకాంతముగ మననము, తత్పరిశీలన చేయుచు అనుభూతి పొందుటకై సదా కృషి సలుపుచున్నాడు. అట్టి అనుభూతిలో "గురువాక్యోపనిషత్" శ్లోకములకు భావార్ధములు వ్రాసి వివరణములు కూర్చుటకు పూనుకొనిచాల వరకు సఫలీకృతుడైనట్లు తెలియవచ్చుచున్నది.

వివరములు కూర్చునపుడు యెన్నో శ్రుతి స్మృతుల మరియు తత్వదర్శన, జ్ఞానుల యొక్క అనుభూతి వాక్యాములను ఉదహరించినారు.

చతుర్వేదములకు సంబంధించిన నాలుగు మహా వాక్యములను తత్సంబంధ ఉపనిషత్తుల శాంతి మంత్రముల వివరణ కూడ సూచించడమైనది.

అంతేగాక సాంఖ్య యోగమునకు సంబంధించిన నాలుగు దేహములు (స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ) వాటి అవస్థలు అధిపతులను తెలియపరిచినారు. మాయ యొక్క స్థాన స్వరూప స్వభావములు తెలుపబడినవి.

ఏంతయో ఓపికచే, పట్టుదల కలిగి యధిక శ్రమతో ఈ గ్రంధమునకు ప్రయోజనము గావించినారు. కావున వ్యాఖ్యాత, మత్ శిష్యుడైన మంత చిన్నయ్య రిటైర్డ్ ఉపన్యాసకుల వారిని నిండు మనసుతో ఆశీర్వదించుచున్నాను. ఇక ముందు చేయు అంతఃకరణ పరిశీలనా వ్యాసంగమునకు మద్గురు మూర్తి తగిన ధీశక్తి యితనికి ప్రసాదించు గాక!

ఇట్లు
**ప్రభోదానంద మల్లు వెంకటరెడ్డి,**
శ్రీ శివరామదీక్షిత అచల గురూప పీఠాధిపతి.
రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్.

తేది : 10-10-2000

ఓం

శ్రీగురుభ్యోనః

## **విజ్ఞప్తి**

సృష్టిలోని సకల చరాచరములందు మానవ జన్మ ఉత్కృష్టమైనది. ఎందుల కనగా మానవ జన్మయందే జన్మరాహిత్యము సాధ్యము. ఇతర జన్మలందు సాధ్యము కాదని పెద్దలు తేల్చి చెప్పినారు. మానవునకున్న విశేష విజ్ఞానముచే ఐహిక ప్రయోజనములకు మాత్రమే గాక తన మానసిక శక్తులను విద్య, ధ్యాన, తపోనిష్ఠాది పారమార్థిక సాధనలచే వికాసము చెందించి, ఏకాగ్రత సాధించి పారమార్థిక విషయములను కూడ మానసిక ప్రత్యక్షము గావించుకొనుచున్నాడు. సృష్టి మూలము నన్వేషించి మానవాతీత శక్తి మహాత్మ్యములను సాధించుచున్నాడు. ఇట్లు సాధించుటలో అతనికి జ్ఞానము తోడ్పడుచున్నది. ప్రాపంచిక జ్ఞానము నిజమైన జ్ఞాన మనబడదు. "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని" అనగా తన యందు సర్వభూతములను, సర్వ భూతములందు తనను చూడగలుగటయే జ్ఞానము. ఇట్టి జ్ఞానము తత్వవిచారణవలన కలుగును. అట్టి తత్వ విచారణకు తోడ్పడునవి వేదములు, వేదాంగములైన ఉపనిషత్తులు. వీటి లక్ష్యము, తెలియరాని పరిపూర్ణ పరబ్రహ్మమును లక్ష్యలక్ష్యార్థరూపముగా వెల్లడించుటయే.

అట్టి లక్ష్యసాధనకు తోడ్పడు ఉపనిషత్తులలో గురువాక్యోపనిషత్తు ఒకటి. ఇట్టి ఉపనిషత్తునకు సద్గురు కృపచే నా కందిన జ్ఞానము వల్ల తాత్పర్యములు వ్రాసి వివరణములు కూర్చితిని.

విద్యాభ్యాసము ఉర్దూ మరియు ఆంగ్ల భాషలలో జరుగుట వల్ల తాత్పర్యములు, వివరణములు వ్రాసి కూర్చుటలో దోషములు చోటు చేసుకొని యుండును. అట్టి దోషములను విజ్ఞులు సరిచేసి చదువుకొనగలరని సవినయముగా మనవి చేయుచున్నాను.

ఈ కృషిలో నాకు తోడ్పడిన శ్రీ అ.ప. విశ్వనాథాచారి గారికి మరియు పోత్సహించిన సత్సంగ సభ్యులకు కృతజ్ఞతాభివందనములు. అందముగా ముద్రించి యిచ్చిన శ్రీరామ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

ఈ చిన్న పొత్తమును మా మాతా పితరులు మెణుసుగోత్రోద్భవులైన కీ॥శే॥ మంత చిన్నమ్మ ఎల్లప్ప గారలు స్మృతిపథములో మెదలగా మద్గురువులు శ్రీ మద్రామడుగు శివరామదీక్షిత గురూపపీఠాధిపతియైన శ్రీశ్రీశ్రీ ప్రబోధానంద మల్లువెంకటరెడ్డి దేశికుల పాదపద్మములకు ప్రథమ పుష్పముగా అర్పించుచున్నాను.

01-7-183/30 ఎ,
హనుమానగర్, మహబూబ్‌నగర్.
01-10-2000.

సద్గురు పాదరేణువు
మంత చిన్నయ్య

ఓం

శ్రీగురుభ్యోనః

## గురువాక్యోపనిషత్తు

**శ్లో॥ ఖంవాయు ర్జ్యోతిరాపః । పృథివీ విశ్వస్యధారణే**
**యత్పరం బ్రహ్మ సర్వత్ర । విశ్వస్యాయ తనం మహత్ ॥ 1**

తా॥ ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివీ యను పంచభూతములచే ఈ ప్రపంచ మాయెను. అదే ప్రకారము యే పరబ్రహ్మ మంతట వ్యాపించి యున్నదో దాని మహత్తంతట వ్యాపించుట వలన విశ్వమునకు స్థానమయ్యెనని చెప్పబడుచున్నది.

**వివరములు :**

వేదములు ఉపనిషత్తులు, వివిధ వాదములు భగవద్గీత, షడ్దర్శనములు, మతములు మొదలగు వాటి యందు చేయబడిన విభిన్న వివరణములను బట్టి సృష్టి కత్యంత మూల కారణము బ్రహ్మమని తెలియవచ్చినది. ఆ బ్రహ్మము తాను తానై నిస్సంకల్ప స్థితిలో నున్నప్పుడు సృష్టి లేదు. తనయందు బీజరూపముగా యణిగి యున్న సత్వరజస్తమో గుణముల సామ్యావస్థయే ప్రకృతి. అదియే అవ్యక్తము, ప్రధానము, మూలమాయ యను పేర్లతో ప్రసిద్ధము. అట్టి గుణములతో కూడినపుడే బ్రహ్మము గుణ యుక్తుడగుట చేత, తన సర్వాతీత స్థితి నుంచి చ్యుతుడై సృష్టి కామనకు లోనగును. అట్టి సగుణ బ్రహ్మమే సృష్టికారణమని కొందరు, అతని త్రిగుణ సమిష్టియగు మాయయే కారణమని కొందరు ప్రతిపాదిస్తు వచ్చినను మూల కారణము బ్రహ్మమేనని నిర్ధారించినారు.

సృష్టికి పూర్వము బ్రహ్మమొక్కటియే యుండెను తన కన్యంగా రెండవది లేకుండెను. "ఏకం అనేకం భవతి" అనె సృష్టి కామన కలిగెను. ఈ సృష్టి కామన విజృంభించి సర్వత్రా వ్యాపించి సృష్టికి బీజరూపమాయెను. ఇట్లు సర్వమును సృజించి దాని యందు తానే అనుప్రవేశము గావించెను.

"తస్మాద్వా ఏ తస్మాదాత్మన, ఆకాశస్సంభూతః, ఆకాశద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః అద్భ్యః పృథివీ, పృథివ్యాదౌషధీయః, ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః॥" యనుశ్రుతి ననుసరించి మరియు "ఆకాశశ్శరీరం బ్రహ్మ" అను రీతిగా ఆకాశమే శరీరముగా గల ఆత్మ నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము,

జలము నుంచి పృథివియను పంచ భూతములు కలిగి ఈ బ్రహ్మాండ పిండాండములు కలిగినవి.

ఈ భావమును శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద.62 "ఆకాశాధిక భూతా। నీకాత్మక మగుచు యెరుక యీ జగమయ్యేన్।" మరియు క.ద.82 "ఎరుకైన భూతముల నీ వెరుగుము ఆకశము గాద్పు యింగలమును నీళ్ళిరవిందనేల యని। నేనెరిగిన పద్ధతి నీకు నెరిగించినానూ ముజ్జగము లయ్యెను వీట్లతోనూ" అన్నారు. మరియు క.ద73 "ఎరుకైన భూతపంచకమెరుకకు। చరణములు కటియు హృదయము గళమున్। శిరమును నయ్యెను క్రమమున। ధరణి మొదల్ జేసి యిట్లు తనాయ గుర్తెరుగూ" యని అన్నారు. పంచభూత పరిణామము చెందిన విశుద్ధ చేతనమునకు, ఆ పంచ భూతములలో పృథివి పాదములు, జలము కటి అనగా నడుము, అగ్ని హృదయము, వాయువు కంఠము, ఆకాశము శిరోభాగము గాను అయి విరాట్ పురుషుని స్థూల దేహమాయెను. (దీనినే క్షేత్రమని పిలుతురు)

"సర్వం ఖల్విదం బ్రహ్మ" చాందోగ్య ఉపనిషత్తు ప్రకారము ఈ జగమంతయు జ్ఞాన కర్మేంద్రియములు మనస్సు అను ఏకాదశేంద్రియముల చేతను శాస్త్ర యుక్తి అనుభవముల చేతను దృశ్యమాన జగత్తు నందు సర్వమును బ్రహ్మమే.

**బ్రహ్మము** : బ్రహ్మము అనగా శబ్దము "బృహి" వృద్ధౌ అనుధాతువు నుండి ఏర్పడినది. కనుక బ్రహ్మమనగా పెద్ద వస్తువు అని అర్థము.

దేవ మానవ పశు పక్షి క్రిమి కీటకాది సకలచరాచర జంతువులున్ను ఆకాశాది పంచభూతములున్ను దేనియందుండి పుట్టునో, దేని సత్తా మాత్రము చేత జీవించుచుండునో మరల మహా ప్రళయంబున సకలము దేనియందు ప్రవేశించి లయించునో ఆవస్తువే బ్రహ్మమనబడును.

**విశ్వస్యాయతనం మహత్** : పరిపూర్ణపరబ్రహ్మమునకు ఏది అన్యముగా నున్నట్లు విశ్వసించబడుతున్నదో అది విశ్వమని చెప్పబడుచున్నది. క.ప.33 "హరియందు దోచు విశ్వము। నర స్వప్నము వంటిదనిరి నానా జనమల్। సురస్వప్నము వంటిది యనె। స్థిరమతి శివ రామ నామ దీక్షితులు ధరన్॥" అని చెప్పటలో పరిపూర్ణములో కలరూపంగా తోచిన ఎరుకే విశ్వము. విశ్వమే ఎరుక అని స్పష్టమగుచున్నది. క.ప.67 "ముడిబడి కర్మము జ్ఞానము। విడువక నా రెండు వెలసె। విశ్వమన నదే। కదువేడ్క బయలుగనెనా

ఘడియైనను నిల్వలేక కల్తై పోవున్" అనగా కర్మ జ్ఞానములు కలసినదే విశ్వమని రాజయోగీయమను నిజప్రబోధ విధానమందు చెప్పబడినది. సృష్టికి కర్తృత్వమును వహించునది, సూర్యాకాశము. పంచ భూతములు కార్యరూపంగా ఉన్నవి కనుక కర్త, కార్యము కలసినదే విశ్వము.

1. సూర్యాకాశము 2. భూతాకాశము 3. వాయువు 4. అగ్ని 5. జలము 6. పృథివి ఈషడ్విధ ద్రవ్యముల సమూహమునకు విశ్వమని పేరు

**మహత్ :** "స్వచ్ఛబ్దవాచ్య మవిద్యాశళ్యబ్రహ్మణో రవ్యక్తమ్, అవ్యక్తాన్మహత్, మహతోఽ హంకారః అహంకాతర్పాంచ తన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యః పంచమహా భూతాని పంచ మహాభూతేఽభ్యో ఖిలంజగత్" ॥ అనగా సత్ అని చెప్పబడుతూ అవిద్యతో గూడిన బ్రహ్మము వలన అవ్యక్తము, అవ్యక్తము వలన మహత్తు, మహత్ వలన అహంకారమును, అహంకారము వలన పంచతన్మాత్రలును, పంచతన్మాత్రల వలన సకల జగత్తు కలిగెను అని సృష్టిక్రమము చెప్పబడినది. పుట్టినదని చెప్పబడుటచే ఆకాశము కంటే ఆత్మ పెద్దదనవలెను. నేను ఆ సృష్టికి పూర్వమున్న ఆత్మను లేక బ్రహ్మమును. నేను అణువు కంటే చిన్నవాడను. మహత్తు కంటె పెద్దవాడను.

"మహతోమహాన్" అనగా గొప్పది లేక పెద్దది. మహత్ లోపలనే సృష్టి జరిగినది. సృష్టి ఎంత వరకున్నదో ఆ ఆవరణము కంటెను పెద్దదై మహత్ నతిక్రమించి అనగా మీరియున్నది. అట్టి మహత్ కంటేను పెద్దదై దానిని గూడ మీరి అతిక్రమించి ఆత్మయున్నదన్నమాట. ఈ ఆత్మనే విశ్వమునుకు స్థానమయ్యెను.

**విశ్వుడు :** విశ్వము నందు నివసించువాడు విశ్వుడు. అనగా విషయవాసనలతో కూడుకొన్నటువంటి వాడు. ఇతడు నేత్ర స్థానమంధుండి జాగ్రత్తవస్థలో చతుర్దశేంద్రియముల కూడు కొని సుఖదుఃఖములనే ద్వంద్వములను అనుభవిస్తు తన వ్యవహారముల జరుపుచుందును.

**శ్లో॥ సూక్ష్మాత్సూక్ష్మపరం నిత్యం। తత్వమేవత్వమేవ తత్**
**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది। ప్రపంచం యత్రప్రకాశతే**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా। సర్వబంధైః ప్రముచ్యతే ॥2॥**

తా॥ ఆబ్రహ్మము సూక్ష్మమైనదాని కంటే మిక్కిలి సూక్ష్మమై. పరమై నిత్యమై శాశ్వతమై యున్నది. ఆ పరబ్రహ్మమే సమిష్టి రూపములో నీవై. వ్యష్టిరూపములో నీవే

ఆ బ్రహ్మమై యున్నావు, అది జాగ్రదవస్థ మొదలగు అవస్థలచే ప్రపంచము నందు ప్రకాశించుచున్నది. అట్టి బ్రహ్మమే, నేనని తెలిసి కొనినచో సర్వ బంధముల నుండి విముక్తుడవగుదువు.

<u>వివరములు</u> - **సూక్ష్మాత్సూక్ష్మ పరం నిత్యం :**

**సూక్ష్మాత్సూ క్ష్మము:** బ్రహ్మము సూక్ష్మము కంటే సూక్ష్మమై శ్రేష్ఠమై పరమై యున్నది. అంటే అణువుకంటే సూక్ష్మము, సూక్ష్మము కంటే అతి సూక్ష్మమైనది. ఉదాహరణకు ఇంటి కప్పులోని రంధ్రము గుండా సూర్యకిరణములు ఇంటిలోకి ప్రవేశించునపుడు ఆ కిరణముల వెలుగులో తేలియాడు అనేక నలుసులు మనకు కానవచ్చును. అందొక నలుసు అణు ప్రమాణము గలదని చెప్పనగును. అంతకన్న సూక్ష్మమైన వస్తువు మనకు కానరాదు. ఆత్మ లేక బ్రహ్మము అంత సూక్ష్మము కంటే ఇంకా సూక్ష్మము గానుండుటచే అది మనకు కానరాదు. అంటే సూక్ష్మాతి సూక్ష్మమై బ్రహ్మాండ భాండానంతములందు ఆబ్రహ్మమే నిండియున్నది. పంచ భూతములకు, కాలము, దిక్కులు మనస్సు ఆత్మ అను నాలుగు కలసి నవవిధ ద్రవ్యములు అనగా వస్తువులుగా చెప్పబడియున్నవి. ఈ నవవిధద్రవ్యము లందు బ్రహ్మము సూక్ష్మాతి సూక్ష్మముగా వ్యాపించియున్నది. ఏవస్తువు యొక్క సూక్ష్మము ఆ వస్తువు నందే యుండును.

**పరం :** శబ్దాది విషయ పంచకమునకు పరమై పంచేంద్రియ జ్ఞానమున కగోచరమై అన్నిటి కంటే వేరైయున్నదని అర్థము. వేరైయున్నదంటె దృగాది గోచరమయ్యే సమస్తమునకు వేరై ఎక్కడో అన్యదేశమున నున్న దనరాదు, విశ్వాతీతము మాత్రమేగాక ఆత్మ దృష్టి గల వారికి ప్రతివస్తువు నందును సూక్ష్మాతి సూక్ష్మముగా బ్రహ్మమున్నది. అనగా ఆత్మ విశ్వగతముగా నున్నది. స్వరూప లక్షణములను బోధించుటకు మాత్రమే శ్రుతి॥ "నేతి వేతి నేతీతిహోవాచ" యని సర్వమును అనాత్మగా నిషేధిస్తు వచ్చినది. అట్లే పరం అను శబ్దమున్నూ బ్రహ్మ స్వరూపము యొక్క విలక్షణత్వమును సూచించుటకు మాత్రమే ప్రయోగింపబడినది.

**నిత్యం :** అనగా త్రికాలము లందు శాశ్వతమైనదని సామాన్యార్థము. అనగా దాని అస్తిత్వము నకు ఉనికికి భంగము లేదన్నమాట. కాని దాని రూప నామము నిరంతరము మారుచునే యున్నవి. అయినను వస్తువు యొక్క ఉనికికి భంగము కలుగుట లేదు. వాంగ్మనస్సుల కందే సమస్తమూ గొప్పదైన ఆ పరబ్రహ్మ స్వరూపమే. ఏవస్తువు కేవలం నశించుట లేదు. నామ రూపములందు భేదము గానవచ్చుట మాత్రమే.

ఉదాహరణగా ఒక చెట్టును ముక్కలు ముక్కలుగా నరికినప్పుడు చెట్టు యొక్క నామ రూపములు నశించినవి గాని, యిప్పుడు చెట్టు కట్టెల రూపములో నున్నది. కట్టెలు కాలితే బొగ్గు రూపము వహించును. ఇంకా కాలితే బూడిద రూపము దాల్చును. ఆ నుసి గాలిలో ఎగిరి వాతావరణము నుండి నేలపై రాలి మన్ను రూపము వహించుచున్నది. కనుక చెట్టు కేవలం నాశనం కాలేదు. Matter is indestrutible అనగా పదార్థమునకు నాశనము లేదని శాస్త్రము చెప్పుచున్నది. ఆ విధంగా బ్రహ్మము నానా రూపములు చెందుచున్నది. ప్రళయానంతరము తిరిగి సృష్టికి పూర్వమున్న స్థితిలో నుంటున్నది. కనుక సృష్టికి పూర్వము, సృష్టి యనంతరము, సృష్టి కాలమందు అనగా భూత, వర్తమాన, భవిష్యత్ కాలమందు బ్రహ్మపదార్థము ఏదో రూపములో వుంటూనే యున్నది. కనుక దానిని త్రికాల బాధ్యము అన్నారు. సద్రూపముగా నున్నదిదే. బ్రహ్మము ఈ దృష్టితోనే నిత్యమన్నారు. అంతేగాని నామరూపములలో మార్పు లేదని అర్థము కాదు. మార్పు చెందేది మాయా. కనుక యిది మాయా బ్రహ్మ మనాలి.

శ్లో॥ అస్తి భాతి ప్రియం రూపం। నామ చ్యేద్యంశ పంచకం।
ఆద్యత్రయం బ్రహ్మ రూపం। జగద్రూపం తతోద్వయం॥

అస్తి, భాతి, ప్రియం, రూప, నామములను ఐదు లక్షణములలో మొదటి మూడు నిత్యమైన బ్రహ్మము గాను, నామ రూపములు అనిత్యమగు జగత్తు గాను చెప్పబడినవి. బ్రహ్మము ఏకము నిత్యము, అనంతము, నామ రూపము లసంఖ్యాకములు అనేకములు అనిత్యములు "ఏకం అనేకం భవతి" అనే న్యాయంగా ఒకే బ్రహ్మము ద్వివిధముగా నున్నది. నిత్యానిత్యములనె ద్వంద్వ లక్షణములుగా గలిగి కారణ బ్రహ్మము కార్యబ్రహ్మమని చెప్పదగియున్నది. నిత్యానిత్యములనె నిర్ణయము ఎరుగని కేవల నిత్యత్వ మొక్క పరిపూర్ణపరబ్రహ్మమందే గలదు.

**తత్వమేవ త్వమేవతత్** : బ్రహ్మమే నీవు, నీవే ఆ బ్రహ్మవు అయి యున్నావు యని అర్థము. "జీవోబ్రహ్మైవనా పరః" జీవుడు బ్రహ్మమే ఇతరము కాదని అద్వైత వాదము వర్ధిల్లినది. "ఆ బ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం" అనగా కానవచ్చేది, తోచివచ్చేది సమస్తమూ పరమాత్మ స్వరూపమేనని, "బ్రహ్మణోన్యం నకించన" బ్రహ్మము కంటె అన్యమైనది కొంచమైన లేదని శ్రుతులు ఘోషించుచున్నవి. అపుడింక బహ్మమయి దగుట అంటే నేమి? ఇది వరకు బ్రహ్మమై యుండక పోతే ఇపుడు

క్రొత్తగా బ్రహ్మము కావలసియుండును. ఇది వరకే బ్రహ్మమై యుండియు అది విస్మరించి నేను బ్రహ్మముగా మారిపోవలెనని కోరుట నిజముగా అజ్ఞాన కార్యమే. దీనికే ప్రాప్త ప్రాప్తవ్యము అని శాస్త్రజ్ఞులు పేరిడిరి. "ఇందుకు కంఠచామీ కరవత్" అనగా మెడలోనే హారమున్న సంగతి మరచి దాని కొరకై వెతుకులాడుట వంటిదని దృష్టాంతమిచ్చినారు.

ఉపాధి గతుడై తన నిజరూపమును మఱచి దేహతాదాత్మ్యము చెంది తన్ను గూర్చి పరిపరి విధములుగ చెప్పుకొనుచున్నాడు. నేను చక్కగా తెల్లగా నున్నాను అన్నప్పుడు స్థూలదేహ తాదాత్మ్యముచే పలుకుచున్నాడు. నేను సుఖముగా దుఃఖంగా యున్నానని సూక్ష్మ దేహముతో, నేను వేదాంతిని, అజ్ఞానిని అని కారణదేహముతోను తాదాత్మ్యము ఏర్పరుచుకొని పల్కుచున్నాడే గాని మహాకారణ శరీర తాదాత్మ్య చెంది ''అహం బ్రహ్మాస్మి'' నేను బ్రహ్మనే అయివున్నాని యదార్థ దృష్టితో ప్రాపంచకవ్యవహారములు అసలే జరుపుట లేదు. కాని నిజంగా బ్రహ్మతాదాత్మ్యస్థితిలో నుండి జీవయాత్ర సాగించినచో తానను వ్యష్టి దృక్పథము నశించి సమష్టి భావములో నుండి నిస్వార్థపరుడై మెలుగును. అట్టి వానికి శరీరింద్రియ మనోబుద్ధ్యాది, సమస్తము మాత్రమే గాక తన శరీరమునకు బయటతోచబడే సమస్తము కూడ బ్రహ్మమే అనే అఖండాత్మ దృష్టియుండును. ఇదే బ్రహ్మమయమగుట. అపుడాతని చిత్తము బ్రహ్మాకార కారిత మయ్యేయుండును. దానిని అఖండ బ్రహ్మాకార వృత్తి యనదగును. అపుడు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయరూప మగు త్రిపుటి భేదమంతరించి "ఏకమేవాఽ ద్వితీయంబ్రహ్మ" అను శ్రుత్యర్థము సార్థకమగును. బ్రహ్మమయము కేవలము గురుకృప చేతనే సాధ్యము.

"ఇతి "తత్వమసి" ప్రభృతి శ్రుతిభిః ప్రతి పాదితమాత్మని 'తత్వమసి త్వము పాధి వివర్జిత సర్వసమం। కింరోదిషి మానసి సర్వసమం"॥ అనగా అదియే నీవు (బ్రహ్మము) అని శ్రుతి ప్రతిపాదించుచున్నది. అది నీలో నీవే అయియుంటివి. నీవు సమస్తమైన ఉపాధులచే విడువబడినావు. అంత సమమైయుండ విచారించుట ఎందులకు?

"తత్వమసి" అనెడి మహా వాక్యము నందు త్వం పదం, తత్ పదం, అసిపదం, అను మూడు పదములున్నవి. త్వమ్ అనగా నీవు. తత్ అనగా అది (బ్రహ్మము) 'అసి' ద్వార రెండును ఒకటేనని తెల్పుట జరుగుచున్నది. ఈశ్వరుడు మాయోపాధిచే చరించుచున్నాడు. జీవుడు అవిద్యోపాధిచే చరించుచున్నాడు. ఉపాధులను వేరు చేసి చూచినచో ఇరువురును ఒకే చైతన్యమై యున్నారు. ఇదియే "తత్వమసి" వాక్యార్థము

ద్వార మనకు కలుగు అపూర్వ ప్రయోజనము. కనుక వున్న సత్యము నీవే అయి యుండుట జరుగుచున్నది. ఉపాధులైన స్థూల సూక్ష్మకారణ శరీరముల నుండి వేరు పడగా జీవుడే బ్రహ్మ మగుచున్నాడు. అట్టి బ్రహ్మము ఏకమైయున్నది. సర్వము సమమైయున్నప్పుడు శోకమేందులకని దత్తాత్రేయుల వారు అవధూత గీత ద్వార ప్రశ్నించుచున్నారు.

"నచవ్యోమ భూమి ర్నతేజో నవాయుః
చిదానంద రూపః శివోఽహంశివోఽహం॥"

ఆకాశము, భూమి, అగ్ని, వాయువు మొదలగునవి నేను కాను. నేను చిదానంద రూపుడనగు శివుడనే, పరమ శివుడనే యని శంకరపూజ్యపాదుల వారు తమ నిర్వాణషట్కమున గానము చేసియున్నారు. **నీవే నేనై యుండగ అన్యమెక్కడిది.**

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచము:**

**1. జగ్రదావస్థ** : జీవుడు 25 తత్వములతో యెర్పడిన తనువును కూడి 14 ఇంద్రియ విషయములనుభవించుచు, నేత్రస్థానమందు విశ్వుడనె పేర నిలిచి, సకల వ్యవహారములు చేయుచుండును ఇదియే జాగ్రదవస్థ. స్థూలశరీరము ఇంద్రియములు, జీవుడు, ప్రాణము, ఆత్మ, ఈ ఐదు చేరి జరువునట్టి వ్యవహారము జాగ్రదవస్థ.

**2. స్వప్నావస్థ** : జీవుడు దశేంద్రియ సమన్వితమైన 17 తత్వములగు సూక్ష్మ తనువును గూడి కంఠమందు తైజసుడను పేరుతో జాగ్రత్త వ్యవహార క్రియలవలె చేయుచుండును. ఇదియే స్వప్నావస్థ. మేలుకొని చూడగ యేమియు లేదు. ఇది సత్యముగాదు.

**3. సుషుప్త్యావస్థ** : జీవుడు అహంకార చిత్తములను కంఠమందుంచి మనోబుద్ధుల దీసికొని కారణదేహము యొక్క హృద్కమలము యందు జేరి అజ్ఞాన సన్నిధి యందు నిలిచి ప్రాజ్ఞడను పేర నుండును. ఇదియే సుషుప్త్యావస్థ.

**4. తురీయావస్థ** : జీవుడు మనస్సును బుద్ధియందు లీనము జేసి మూర్ధ్ని నందు ప్రత్యగాత్మయనే పేరున నిలిచి యుండును, ఇదే తురీయము. శరీరము మీద సర్పము బారినను స్మృతి లేక యుండును.

ఏదేని యొక్క సాధనచే పొందబడు స్వస్వరూప సాక్షాత్కార స్థితియే తురీయావస్థ. వేదాంత వ్యవహారజ్ఞానశాస్త్రము, వాక్యార్థము అయియున్నది. వార్తికము పరమాత్మజ్ఞాన



శాస్త్రము, లక్ష్యార్థమై యున్నది.

**5. తురీయాతీతము :** జీవుడు బ్రహ్మతాదాత్మ్య స్థితిని దాటి నామరూప నటన క్రియలు ఏమి లేని పరిపూర్ణపరబ్రహ్మను అపరోక్షము గావించుకొన్న స్థితియే తురయాతీతావస్థ. దీనినే కైవల్యశరీర నిర్ణయపద్ధతి, క్షరాక్షర ద్వయదోషరహిత పురుషోత్తమ పద్ధతి.

ప్రత్యగాత్మ స్థూలశరీరము నందభిమానము కలిగి తన కొరకు యొక జీవనవిధాన మేర్పరుచుకొని జీవించవలయుననెడు గాఢమైన కాంక్ష అనగా శరీరమును శాశ్వతముగా నంటి పెట్టుకొనవలెనను కొర్కెగలవాడు జీవుడు.

| క్రమ సంఖ్య | శరీరములు | అవస్థలు | అభిమానులు | ఇంద్రియ-ములు | స్థానము | వ్యవహారము |
|---|---|---|---|---|---|---|
| 1. | స్థూల శరీరము | జాగ్రత | విశ్వుడు | 25 | నేత్రము | క్రియారూపము |
| 2. | సూక్ష్మ శరీరము | స్వప్న | తైజసుడు | 17 | కంఠము | భావనా రూపము |
| 3. | కారణ శరీరము | సుషుప్తి | ప్రాజ్ఞుడు | మనోబుద్ధులు2 | హృదయము | ప్రాణరూపము |
| 4. | మహాకారణ శరీరము | తురీయము | ప్రత్యగాత్మ | - | మూర్ధ్ని | సర్వాత్మకము |

అవస్థాత్రయములకు జ్ఞానము (బ్రహ్మములేక ఆత్మ) సాక్షిగాయున్నది. ఈ జ్ఞానము ఊర్ధ్వపరిణామములో బ్రహ్మము, అధోపరిణామములో జీవుడనబడును. ఈ రెండు చిత్తమనె క్షేత్రములో జరుగును. క్షేత్రజ్ఞుడు (రూపము) వాయువును చేరె వరకు లేకుండ పోవును. ఈ విధముగా బ్రహ్మము మారుచుండును. ఈ వ్యవహారమంతయు ప్రపంచ సంబంధమైనది. ఈ ప్రపంచ మంతయు బ్రహ్మప్రకాశమునలననే సృష్టిస్థితి లయములు జరుగుచున్నవని ముముక్షవు తెలిసికొనవలయును.

జాగ్రదావస్థలోయుండె ప్రజ్ఞానము స్వప్నావస్థలో కొంత తగ్గును. తిరిగి సుషుప్త్యావస్థకు వచ్చినపుడు ఆ ప్రజ్ఞానము యేమిలేకుండపొవును.

**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా :** అట్టి బ్రహ్మము తానేనని తెలసిన యని అర్థము.

శంకరులవారు ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతము ప్రకారము బ్రహ్మముగాక మరొండు వస్తువులేదనియు, ఆ **బ్రహ్మము** ఎన్నడును రెండుగా మారని దనియు

తెలియుచున్నది. బ్రహ్మమనగా నిత్యమై శుద్ధమై ఆది మధ్యాంత రహితమై అద్వయమై నిష్క్రియమై నిర్గుణమై స్వయం ప్రకాశమై సర్వకారణమై సర్వమునకు ఆధారమును అధిష్టానమును అయి సర్వవ్యాపకమై సచ్చిదానంద లక్షణములే స్వరూపముగా గలదై మనోవాగ గోచరమైయుండునదే బ్రహ్మము అని చెప్పబడును. ఇది స్వరూప లక్షణమునగా, సహజలక్షణము, మెదటి రూపము. ఈ స్వరూపమునగల దొక బ్రహ్మమే. కనుకనే "ఏకమేవ" అన్నారు. అటువంటిది మరొకటి లేదు గనుక ప్రతి లేని దగుట చేత "అద్వితీయం" అని అన్నారు ఇట్టి బ్రహ్మము తానేనని జీవుడు తెలియుట వల్ల బంధ విముక్తియని ఈ శ్లోకము ప్రబోధించుచున్నది. ఇచట జీవుడు బ్రహ్మమెట్లయి నాడో తెలియవలసి యున్నది.

అజ్ఞానము వ్యష్టి సమిష్టి రూపము గానున్నది. అజ్ఞానము యొక్క అంశమునకు వ్యష్టి అజ్ఞానమని పేరు. సంపూర్ణ అజ్ఞానమునకు సమిష్టి అజ్ఞానమని పేరు. అజ్ఞానము యొక్క వ్యష్టి రూపమైన మలిన సత్వము నందున్న చేతనా భాసము ఆ అజ్ఞానాంశమునకు అధిష్ఠానమైన కూటస్థ చైతన్యము చేరి జీవుడనబడును.

కూటస్థునకు, బ్రహ్మమునకు కించిన్మాత్రమగు భేదము మాత్రమే గలదు. కూటస్థ చైతన్యమన్న (ఉపహిత చైతన్యము లేక అవిచ్ఛిన్న చైతన్యము) ఉపాధియందు సాక్షిరూపముగా నున్న చేతనమే. ఇది ప్రతి ఫలించును గాని బ్రహ్మ చేతనము ప్రతి ఫలించునని యనరాదు. అంతఃకరణము లేక బుద్ధినందలి చేతనా భాసము కూటస్థచేతనము కూడి జీవుడని కూడ జెప్పబడును. కాని అట్లు చెప్పుటచే సుషుప్తి యందున్న కారణ శరీరాభిమానియగు ప్రాజ్ఞునికి హానికలుగును. ఏలనన సుషుప్తి యందు అంతః కరణము (లేకబుద్ధి) మగ్నత జెందును. వ్యష్టి అజ్ఞానాంశము నందలి చిదాభాసము, కించిజ్ఞత్వ లక్షణములు మాత్రమే కలిగి యుండును. స్వల్ప జలమందలి ప్రతిబింబము ఎట్లు చక్కనైయుండదో అట్లే మలిన సత్వమగుటవల్ల వ్యష్టి అజ్ఞానాంశము యందు అవరణ[1] విక్షేపములు[2] అధికముగా నుండును. గనుక స్వరూప జ్ఞానము అనగా తాను ప్రత్యగాత్మననుజ్ఞానము లేకపోవుట చేతను తన కుపాధియగు అజ్ఞానమునందు తాదాత్మ్యబుద్ధి చేతను జీవుడు బద్ధుడై సంసృతి పొందుచున్నాడు.

సమిష్టి అజ్ఞాన స్వరూమై సత్వగుణ ప్రధానమై యుండు మాయాయందలి చిదా భాసమును మాయా సహిత చైతన్యమును గూడి ఈశ్వరుడనబడును. సత్వగుణ స్వరూపమైయున్న ఈశ్వరోపాధియగు మాయ యందు ఆవరణ విక్షేపములు

1. బ్రహ్మస్వరూపమును మరుగుపరచి స్వస్వరూపజ్ఞానము కలగకుండ చేయుటయే ఆవరణ లక్షణము.
2. భ్రమాజ్ఞానము గలిగించి దానియందు సత్యత్వ బుద్ధిని గలిగించుటయే విక్షేపకార్యము.

ప్రబలమైయుండనందున ఈశ్వరుడు సర్వజ్ఞుడు, స్వతంత్రుడు, నిత్యముక్తుడై యున్నాడు.

మాయ అవిద్యల చేరిక లో బ్రహ్మము సోపాధికమై జీవేశ్వర నామములు చెందుచున్నదని సిద్ధించుచున్నది. కనుక జీవేశ్వర బ్రహ్మములకు పారమార్థిక భేదము లేదు. కనుకనే "జీవో బ్రహ్మైవనాపరః" అనగా జీవుడు బ్రహ్మమే, వేరుకాదని అద్వైత వాదము వర్థిల్లినది.

జీవుడు నిజముగా సంపూర్ణ స్వతంత్రుడు[1] విభువు, స్వాత్మస్వరూపమైన బ్రహ్మమే. ప్రత్యగాత్మ స్వరూపమే పరమాత్మ స్వరూపమే గదా! తనకు కారణ శరీరమగు వ్యష్టిజ్ఞాన సంసర్గముచే దేహేంద్రియాదులతో తాదాత్మ్యము చెంది జీవడని చెప్పబడుచున్నాడు. జీవ అనగా ధాతు వ్యుత్పత్తిని బట్టి ప్రాణాధారమని యర్థము. పరమాత్మ యొక్క చలన శక్త్యాత్మకమగు ప్రాణ సహితుండైయుండుట వలన జీవ శబ్దముచే నాతని వ్యవహారము ప్రవర్తిల్లినది.

వ్యష్టి అజ్ఞానమే జీవుని కారణ శరీరమై యున్నది. వ్యష్టి అజ్ఞానాంశము యొక్క చేరిక, లేక సమిష్టి అజ్ఞానమే ఈశ్వరునకు శరీరమగుచున్నది. కావున వ్యష్టికారణ శరీరా భిమానియగు ప్రాజ్ఞునకును, ఈశ్వరునకును ఆవిధముగా భేదములేదు. కనుక మాహావాక్య విచారణ యందు "తత్వమసి" వాచ్యార్థము వివరించుట పట్ల "తత్" పదమునకు సర్వజ్ఞత్వ విశిష్టుడగు ఈశ్వరుడును, "త్వం" పదమునకు కించిజ్ఞత్వ విశిష్టుడగు జీవుడను అర్థముగా చెప్పబడి పిమ్మట జహదజహర్లహక్షణము (భాగత్యాగ లక్షణము) చే వారి ఉపాధులను ఉపాధి ధర్మములను సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వాదులను పరిత్యజించి శేషించిన అధిష్ఠాన చేతనమునకు "అసి" పదముచే నైక్యము ప్రతి పాదించబడినది. లక్ష్యార్థమున ప్రత్యగ్బ్రహ్మైక్యము నిరూపితము. కనుక వాచ్యార్థమున ఉపాధి విశిష్టమగు ఆత్మతత్వములకు అనగా జీవేశ్వరులకు ఐక్యము సిద్ధాంతము చేయబడినది.

జీవుడు తాను నిత్యముక్తుడై యుండి బ్రహ్మస్వరూపుడై యుండి ముక్తిని గోరుట ప్రాప్త ప్రాప్తవ్యము అని వర్ణింపబడినది. అనగా తానుముక్తుడయ్యును అనగా ముక్తి యిది వరకే తనచే పొందబడియుండియు పొందబడనిది గాను, ముందు పొందదగినది గాను యెంచుచుండుట "కంఠ చామీకరవత్" అనగా ఒక పసిబిడ్డ తన కంఠమున నున్న హారమును మరిచి హారము కావలెననివిలపించుచున్నట్లుగా, జీవుడు లేని బంధ

1. మానవుడు పుట్టుకతో సర్వస్వతంత్రుడు గాని సర్వత్ర సంకిళ్ళచే బంధించబడియున్నాడు - రుసో.

మారోపించుకొని ముక్తిని పొందగోరుచున్నాడు. బంధము లేనే లేదు, కనుక మోక్షము కూడలేదు. కనుక బంధము పోవలె ననుట పరిహృత పరిహారమైనది. తన నీడ యందొక పిశాచముండి తన్ను వెంబడించున్న దని, దానిని వదిలించు కొనవలెనని మూఢుడు ప్రయత్నించినటులనే లేని బంధమున్నదని భయపడి బంధమును వదిలించు కొనవలయునని కోరుట అట్టిదే. **ముక్తి సిద్ధ వస్తువే గాని సాధించవలసి నది గాదు. ఉపాధి రూపమగు తన అజ్ఞానావరణమును తొలిగించుకొనవలసియున్నది.**

శ్లో॥ అహం నిర్వికల్పో, నిరాకారరూపో,
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్
నచా సంగతం నైవ ముక్తిర్నమేయః
చిదానందరూపః శివోఽహం శివోఽహం॥ అని

శ్రీ శంకరపూజ్యపాదలు తమ నిర్వాణ శట్కకమున గానము చేసియున్నారు. అనగా నేను భేదవికల్పములు లేని వాడను. ఏ ఆకారములు లేనివాడను, నా యొక్క ఇంద్రియములు అంతట వ్యాపించి యుండుట వల్ల నాకు సంబంధించినదంత యేది యులేదు. ముక్తి లేనేలేదు. తెలియదగినది లేదు. జ్ఞానానంద రూపుడనైన శివుడను నేను, నేను శివుడును. స్వతసిద్ధమైన ఆత్మ ఊడి పడేది కాదు, లేకుండ వచ్చేది కాదు అని "శంకరులు" వివరించియున్నారు.

**సర్వబంధైః ప్రముచ్యతే** : సర్వ బంధముల నుండి ముక్తుడగు నని శ్లోకమున చెప్పబడినది. సర్వబంధములంటే ఏమిటో ముందుగా తెలుసుకొనవలసి యున్నది.

బంధమనగా కట్టుబడి యుండుట. అనగా ఇచ్ఛ వచ్చిన రీతి సంచరించుటకు దుష్ఫలితములు రాకుండుటకు స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లేకుండ ఏదో అవ్యక్త శక్తిచే సంకెళ్ళు వేయబడి నట్లుండట బంధమనబడును.

బ్రహ్మాదిస్తంభ పర్యంతము ఏదో తెలియరాని యొక్క సూత్రమునకు బద్ధమై యున్నది. ఇదియే బంధము.

బంధములు మూడు విధముగా యున్నవని చెప్పబడినవి: 1. జీవ బంధము 2. పరమాత్మ లేక ఈశ్వరబంధము 3. జ్ఞాన కర్మ బంధములు.

**జీవబంధము** : పంచీకృత పంచ మహాభూతములతో ఏర్పడిన ఈ బ్రహ్మాండ మందు పంచతన్మాత్రలు విషయ రూపముగా అనగా శబ్ద, స్పర్శ, రస, రూప,

గంధములుగా నున్నవి. అందు శబ్దము యొక్క లోలత్వము చే లేళ్ళు, పాములు స్వనాశనము తెచ్చుకొనుచున్నవి. ఏనుగులు స్పర్శసుఖమాసించి, మిడుతలు అగ్ని యొక్క రూపమునకు భ్రమించి, జలచరములు జిహ్వా విషయమగు రసమునకు లోలత్వము చెంది సర్వనాశనము తెచ్చుకొనుచున్నవి.

శ్లో॥ "కురంగ, మాతాంగ పతంగ మీనాః భృంగాః పంచభిరేవపంచ" అని చెప్పబడినట్లు జీవులు ఒక్కొక్క తన్మాత్ర చేత ఆకర్షించబడి ప్రాణహాని తెచ్చుకొనుచున్నవి. కాని మానవుడు ఐదు తన్మాత్రలకు లోనై సత్ఫలితములకు పొంగి, దుష్ఫలితములకు కృంగి దుఃఖముల పాలగుచున్నాడు.

"గుణదోషమయం స్రష్టా సృజన కౌతుకి" అన్న న్యాయముగ అన్నియూ ద్వంద్వ లక్షణోపేతమై యున్నవే కాని కేవలత్వమునునది ప్రపంచమందలి ఏవస్తు నందైననూ లేదు, కనుక దోషము వస్తువునందులేక తనయందే యున్నది. శబ్దాది విషయములను గుర్తించునది మనస్సేనని గుర్తించినచో బంధమే లేదు. కనుకనే "మనఏవ మనుష్యాణాం, కారణ బంధ మోక్షయోః" అని చెప్పబడినది కనుక బంధము అంతర్దృష్టియే యని చెప్పవలయును. బంధమునకు మనస్సు కూడ కారణమే. **మనస్సు సంస్కారముల మూటయే.** సంస్కారములు లేనిచో మనస్సే లేదు. కావున ఈ మనస్సును వాసనా క్షయము గావించుకొన్నచో ఇక బంధమే లేదు. గురు కృపవల్ల ఈ బంధము నుండి ముక్తి పొందగలము.

**పరమాత్మ లేక ఈశ్వర బంధము** : పరమాత్మ సృష్టిస్థితిలయము చేయుటకు బద్ధుడైయున్నాడు. అది అతని కర్మ. కర్మకారణమైన ప్రాణచలనము సృష్టి సంకల్పమునకు పూర్వమతన యందే బీజరూపముగా నుంచుకొని ఉత్తరోత్తర సృష్టులను ఆవిర్భావము చేయుచున్నాడు. ఇదియే పరమాత్మకు బంధము.

**జ్ఞాన కర్మబంధము** : పరమాత్మ రెండు భాగములుగ కాలేదు. కాని ద్వంద్వ లక్షణములతో రెండు రీతులుగా కానవచ్చుచున్నది. జ్ఞానకర్మలకు శబ్ద భేదమేకాని వస్తు భేదములేదు. బ్రహ్మకు సృష్టి సంకల్పము కలిగినప్పుడు ఆ సంకల్పమే జ్ఞాన స్వరూపము. ఆ సంకల్పమే జన్మ. ఆ సంకల్పము వలన కలిగిన చలనమే ప్రాణము. ఆ ప్రాణశక్తి యొక్క పనియే కర్మ. కనుక జ్ఞానము సంకల్పము, జన్మ, చలనము ప్రాణము. కర్మ యివన్నియు ఒకే బ్రహ్మమునకు, ఒకే సంకల్పముతో ఒకే కాలములో ఏర్పడినవి కనుక ఎన్నో రీతులలో యున్నది ఆ బ్రహ్మమే.

సమిష్టి జ్ఞానము యొక్క ప్రకాశములో వ్యష్టిజ్ఞానము సర్వము తెలుసుకొనుచున్నది. అట్లే సమిష్టి ప్రాణచలన శక్తి చేత వ్యష్టి ప్రాణము కర్మ కారకమగుచున్నది. అందుకే కృష్ణ దేశికేంద్రులవారు క.ప.23 "ఎరుగుట జ్ఞానము, దానను। జరిగే పని కర్మయనుచు। జనులెన్నిరి" మరి, శివరామదీక్షితుల వారు శెలవిచ్చినట్లు "గుర్తెరుగక ఎవరున్నూ ఏకర్మ చేయరు" కనుక జ్ఞాన కర్మ లొక్కటే. అయినను క.ప.67 "ముడిబడి కర్మము జ్ఞానము। విడువక నా రెండు వెలసె। విశ్వమననదే" అని జ్ఞానకర్మలు రెండు వస్తువులు గానున్నట్లు పేర్కొన్నారు. వానికి నిజాభిప్రాయమెట్లు తీసుకొనవలయుననగా నిస్సంకల్పరూపమైన బ్రహ్మమునకు సంకల్పము కలుగుట యే 'ముడి' యిదే ఎరుక కూకుదువేరు. ఇదే జ్ఞాన కర్మల బంధము. ఈ బంధములో జ్ఞానము కర్మవలన బంధింప బడెననిగాని, కర్మము జ్ఞానము వలన బంధింపబడెనని గాని చెప్పరాదు. జ్ఞాన కర్మలు రెండు కలసి జ్ఞాన కర్మలను రెండింటిని బంధించెనని చెప్పవలెను. కనుక పరమాత్మ స్వరూపమైన బంధము యిట్టిది. ఈ జ్ఞాన కర్మలు రెండు అనాదిగా బ్రహ్మము నందు నుండుటచే అహమే బంధమనవలెను. ఆ బ్రహ్మమే మోక్షము.

**శ్లో॥ యోవేదాదౌ స్వరః ప్రోక్తో । వేదాంతేచ ప్రతిష్ఠితః**
**తస్యప్రకృతిలీనస్య । యః పరస్సమహేశ్వరః 3॥**

తా॥ సకలవేదములందు స్వరము (ప్రణవము) మొదట చెప్పబడినదో ఏ స్వరము సర్వ వేదాంతము లందు ప్రతిష్ఠించ బడినదో, స్థాపించపబడినదో, అట్టి ప్రణవ స్వరూపము ప్రకృతిలో లీనమైన దానికెవడు పరమైయుండునో వాడే ఆ మహేశ్వరుడు. (ఆ మహేశ్వరుడే ఆత్మజ్ఞానియగును)

**వివరములు :**

**సకల వేదములు :** వేదము "విద్" అనుధాతువు నుండిపుట్టినది. విద్ అనగా ప్రకాశము, ఎరుక, జ్ఞానమని నిర్ణయము. "వేద ఇతీతి వేదః" తెలియజేయునది గాన వేదమని చెప్పబడును. ఈవేదములు మూడు భాగములు **1. కర్మకాండము** – ఇహపర సుఖములకు తగిన కర్మానుష్ఠానములను, యజ్ఞము జేయు విధమును, వాటి వలన కలుగు ఫలమును బోధించును. **2. ఉపాసనాకాండము** – పరమేశ్వరుని యందు భక్తి చేయు విధమును కలుగు ఫలమును బోధించును. **3. జ్ఞానకాండము** – తత్వజ్ఞానము వలన బ్రహ్మ జ్ఞానమును పొందుమార్గమును అందువలన కలగు ప్రయోజనమును బోధించును.

వేదము నందు కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ యనునవి విభజనలేక ఒకటిగా యున్నందున అధ్యయనము చేయు వారికి కఠినముగా నుండు నని తలంచి శ్రీ వ్యాస భగవానులు ఋక్, యజు, సామ, అధర్వణములని నాలుగుగా విభజించినారు. యజుర్వేదమును కృష్ణ, శుక్ల మని వాజసనేయుల కాలమున రెండు భాగములుగా విభజింపబడినది.

**వేదాంతములు** : వేదములకు చివర నుండుటచే వీటిని వేదాంతములన్నారు. వీటిని వేద శిరస్సులు, రహస్యములని, ఉపనిషత్తులని చెప్పబడును. 1. వేదములు యొక్క పర్యవసానము తెలియజేయునది గనుక వేదాంతమనియు 2. వేదమునకు ఉపనిషత్తులు శిరస్థానమైనందున వేద శిరస్సులని 3. పరమాత్మ జ్ఞానము కలుగ జేయునదై ఆచార్యుని యొద్ద నభ్యసించదగినది యైనందున రహస్యమని, అంతరంగమని చెప్పబడును. ఉపనిషత్తులు, ఉప+ని+షత్తు యను మూడు పదములతో కూడియున్నది. ఉప=సమీపము ని= చక్కగా, షత్ =పొందబడినది. నాలుగు వేదముల నుండి ఉపనిషత్తులు 1180 కలిగెను. ఋగ్వేదము నుండి 21, శుక్లయజుర్వేదము నుండి 109, సామవేదము నుండి 1000, అధర్వణ వేదవలనుండి 50 మొత్తము 1180 శాఖలుగానైనను యిందు 840 కర్మఖాండను 232 ధ్యేయబ్రహ్మాను, 108 జ్ఞేయబ్రహ్మమును బోధించునవి కావున జ్ఞాన కాండయని చెప్పబడును. ఇందు ఈశ, కేన, కంఠ, ముండుక, మాండుక్య, బృహదార్ణ్యక, చాంద్యోగ, ప్రశ్న, తైత్తరీయ యను దశోపనిషత్తులు ద్వైతాద్వైత, విశిష్టాద్వైత మొదలగు మతముల వారు, వారికి అనుకూల పద్ధతులతో భాష్యములు వ్రాసి ప్రచారము చేయుచున్నందున 108 ఉపనిషత్తులలో యీదశోపనిషత్తులు శ్రేష్ఠమని చెప్పుదురు. ఈ దశోపనిషత్తుల కిచ్చిన ప్రాముఖ్యత యితరోపనిషత్తుల కివ్వరు. ఎందుకనగా వారివారి మత ధర్మములకు వ్యతిరేకమైన వాక్యములు వాటి యందుండుటవలన. ముక్తి కోపనిషత్తుయను అంత్యోపనిషత్తుయందు విదేహమోక్షమునకు 108 ఉపనిషత్తుల యొక్క జ్ఞానము అవసరమని శ్రీరామచంద్రుడు ఆంజనేయునికి చెప్పినట్లుగా యున్నది.

**స్వరం** : స్వరము, ప్రణవము, స్వర్గం. అకారాది అచ్చులు, కంఠధ్వనియని అర్థములు గలవు. క.ద. 122 "పంచదశాక్షరముల ప్రపంచము తానుద్భవించే ప్రణవాక్షర మందంచు శ్రుతులెన్నె" యని శ్రీ షణ్దేశికేంద్రులు గానము చేసినట్లు ఏ బదియక్షరముల చేత శబ్ద విస్తీర్ణమయిన ప్రపంచముపుట్టినది. ఇందుకు కారణము ప్రణవాక్షరమని

శ్రుతులు నిర్ణయించినవి. "ప్రణవోయీ పరం బ్రహ్మ, ప్రణవశ్చ పరస్మృతః" అనగా ఓం కారము నిశ్చయముగా పరం బ్రహ్మము. ప్రణవమే పరమాత్మయని చెప్పబడుచున్నది. కనుక వాచ్యమగు బ్రహ్మమునకు, వాచకముగు ఓంకారము వేరు కానందున ఓం కారము ఏబదియక్షరములకు మూలమని నిర్ణయము.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" యని భగవానుడు ప్రబోధించగా నారదమహర్షి దీనిని అమాత్రుకగా నుడవగా, శ్రీ వసిష్ఠులు దీనిని త్రిమాత్రుకగా వివరించిరి. కాని యాజ్ఞవల్క్యులవారు దీనిని చతురాక్షరిగానే వర్ణించిరి. శ్రీ భాగవతుల కృష్ణదేశికేంద్రులవారు దీనిని చతురాక్షరి గానే స్వీకరించి తమ ప్రణవార్థ ప్రకాశికయందు దానిని బలపరిచిరి. కావున **అ**కార, **ఉ**కార, **మ**కార, **అర్ధమాత్రుక** స్వరూపమైన ఈ ప్రణవము వలన ప్రపంచ మాయెను. అదెట్లనగా "**అ**" కారము లయము పొందుగా భూమి, అగ్ని, ఋగ్వేదము భూలోకము బ్రహ్మము అవిర్భవించెను "**ఉ**" కారము లయము పొందగా అంతరిక్షము, యజుర్వేదము, భువర్లోకము, సనాతమైన విష్ణువు ప్రభవించెను. "**మ**" కారమువలన ద్యులోకము, సూర్యుడు, సామవేదము స్వర్లోకము, మహేశ్వరుడు సుద్భవించిరని శాస్త్రములు ఘోషించుచున్నవి.

**1. అకాకార్థము** : శోత్రాది పంచజ్ఞానేంద్రియంములను వాగాది పంచకర్మేంద్రియములను శబ్దాది పంచతన్మాత్రలు, ప్రాణాది పంచవాయువులు, మనస్సుయను అంతఃకరణ చతుష్టయమగు 24 తత్వములు చేరి స్థూల శరీరమాయెను. దీనికి జాగ్రత్త–అవస్థ, విశ్వుడు – అభిమాని, క్రియా –శక్తి, రజస్సు– గుణము, నేత్రము – స్థానము, యుక్తము – భోగము, వీనితో కూడిన ఈ ఆత్మ జీవాత్మ యనబడును. వీడు వ్యవహారిక జీవుడనబడును. ఇది అకారార్థము. ఇదే ఋగ్వేదమున, "ప్రజ్ఞానం బ్రహ్మ" యను విధి వాక్యమునకు మూలస్థానము.

**2. ఉకారార్థము** : జానేంద్రియము లైదు కర్మేంద్రియము లైదు, ప్రాణేంద్రియము లైదు మనో బుద్ధులు రెండు కూడి (17) పది ఏడు తత్వములతో గూడిన అంతరాత్మయైన లింగమే హిరణ్య గర్భము. ఇదే సూక్ష్మ శరీరము. దీనికి స్వప్నము – అవస్థ, తైజసుడు – అభిమాని, ఇచ్ఛా – శక్తి, సాత్వికము – గుణము, కంఠము – స్థానము, స్వేచ్ఛ – భోగము అను వీనితో కూడి వ్యాపించిన ఆత్మ అంతరాత్మయనబడును. వాడే ప్రాతిభాసిక జీవుడు. ఇది ఉకారము, యజుర్వేదమున, "అహంబ్రహ్మ". అనుభవాక్య మునకు నిలయమయ్యెను.

**3. మకారార్థము :** ముందు చెప్పబడిన స్థూల, సూక్ష్మ శరీరముల రెండింటికి కారణమగుటను బట్టి కారణ శరీరమనమడును. అవ్యాకృతమైన మహదహంకారమే కారణ శరీరము. అదే త్రిగుణ గర్భము. దీనికి సుషుప్తి – అవస్థ, ప్రాజ్ఞుడు – అభిమాని, ద్రవ్యము – శక్తి, తామసము – గుణము, హృదయము – స్థానము, ఆనందము – భోగము, అనువీనితో గూడి వ్యాపకమైన ఆత్మ పరమాత్మ యనబడును. సామవేదమున, "తత్వమసి"యను వుపదేశవాక్యము మకారము వలన ఉద్భవించినది.

**4. అర్థమాత్రక :** దీని వలన శుద్ధ లింగము అని పిలువబడు సమిష్టి మహాకారణ శరీరమును మరియు వ్యష్టిమహాకారణ శరీరమును, ఈ రెంటికి సంబంధించిన పరమాత్మ ప్రత్యగాత్మలను అభిమానులు, తురీయావస్థలు ప్రధానగుణమును, పరాశక్తియును సదా శివుడును, వారి వలన ప్రాప్తముగు మోక్షమును దాని కాధారమగు అఖండ ఎరుకు లేక పరాఎరుకకు ఆధారమని స్పష్టమగుచున్నది. దీనికి స్థానము మూర్ధ్ని. అథర్వణ వేదమున, అయమాత్మ బ్రహ్మయనబడు సమాప్త వాక్యమునకు స్థానమని సువ్యక్తమగుచున్నది. అనగా ఓంకారము సగుణ నిర్గుణములకు, సాకార నిరాకారములకు నిలయమైన మాయాజగత్తులకును ఆధార ఆధేయముగానున్నదని స్పష్టమైనది.

**ప్రకృతి :** జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు ప్రాణేంద్రియము లైదు విషయేంద్రియము లైదు అంతఃకరణము చతుష్టయము కలసి 24 తత్వములతో కూడి ధవళ, శ్యామల, రక్త, పీత, వర్ణములు నాలుగు గల్గియున్నది ప్రకృతియనబడును. అదియే జడము, దృశ్యము, అవిద్య, అజ్ఞానము, అనాత్మ, జగము, సంసారము, బంధము నరకము యనబడును.

పంచాకాశావరణ మధ్య ప్రదేశము నందు అధిష్టానచేతన బ్రహ్మము పంచావరణముల యందుండును. గనుక చేతన బ్రహ్మమునకు పురుషుదని పేరు. దీని ఆవరణమునకు ప్రకృతియని పేరు, పంచాకాశ స్థూలములగు పంచభూతములు కూడా ఈ ప్రకృతిలోనివే. వీని సూక్ష్మరూపమగు ఆదిత్యవర్తియగు పరమాత్మ, పురుషుదని పేరు. పురుష ప్రకృతులు వేరు గాక అగ్నిని విడిచి ఊష్ణశక్తి నుండనట్లు యేకముగానే యుండను.

ఈ పురుష ప్రకృతులు సృష్టి స్థితిలయములు పొందుచున్నవి. ప్రకృతిని రహిత పరిచి పురుషుడు బ్రహ్మైక్యము పొందునని చెప్పిన వాక్యములు అసత్యములు. జ్ఞాన

బల(క్రియలు (బ్రహ్మము యొక్క సహజ ధర్మములు, ఈ(బ్రహ్మ శక్తినే (ప్రకృతియని, మాయ, శక్తియని, (ప్రాణమని, నామాంతరములు.

**మహేశ్వరః** : "మహేశ్వరః మహంతో (బ్రహ్మదాయః ఈశ్వరఃయస్మాత్స మహేశరః" గొప్ప (బ్రహ్మదిశాసకులు ఎవని వల్ల కలిగినావో అతడు మహేశ్వరుడు. (శ్రుతి॥ "ఏష సర్వేషు భూతేషు గూడోత్మాన (ప్రకాశతే దృశ్యతే త్వ(గ్యయాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" కఠ॥ (బ్రహ్మము సూక్ష్మ బుద్ధిచే మా(త్రమే తెలుసుకొనదగినదని ఈ (శ్రుతిచాటుచున్నది. (పరిపూర్ణ దర్శనా చార్య యిలపకుర్తి వీరవెంకటరామచం(ద్రరావు గారి పరిపూర్ణదర్శనము పుట సంఖ్య 128 వివరములకై చూడగలరని మనవి). వాడే శేష్ఠమైనవాడు, మహైశ్వరుడనబడును.

సృష్టికి మూలకారణము (బ్రహ్మము. (బ్రహ్మము సృష్టికామనకలిగి "ఏకం అనేకం భవతి" అన్నట్లు అనేకముగా మాయచే సకల చరాచరముల సృష్టించి అందు తాను అను(ప్రవేశము జేసెను. సృష్టి సమస్తము నందు 84 లక్షల జీవరాసల యందు పురష (ప్రకృతుల వలన మళ్ళి మళ్ళి జన్మదాల్చి చివరకు (ప్రళయ కాలమందు (ప్రకృతి (బ్రహ్మమందు లయమగును. అట్లు లయమైన (బ్రహ్మమునకు పరముగా నుండువాడే (శ్రేష్ఠమైనవాడు మహేశ్వరుడనబడును.

**శ్లో॥ (ద్రష్టృ దర్శన దృశ్యానాం । విరామో య(త్రవాలభేత్**
**దృష్టిస్త (త్రైవకర్తవ్యా । ననాసా(గ్రావలోకనే॥ 4**

తా॥ (ద్రష్ట (చూచువాడు) దర్శన (చూపు), (దృశ్యము చూడ బడు వస్తువు) యను (త్రిపుటి నిలకడగలదిగా యెక్కడైతే పొందుదురో యచ్చటనే దృష్టి కేం(ద్రీకరించవలయుగాని ముక్కు కొన పై దృష్టిని నిలుపరాదు.

గీ॥ (ద్రష్టదర్శన దృశ్యవిరామ మెచటనగు
నచట దృష్టిని నిలుపంగనగునుగాని
చెదరి నాసా(గమున చూపు జేర్పదగదు
కోరి యమనస్కరాజయోగులకు వత్సా॥

తా॥ పు(త్రా! జ్ఞానయోగమును నా(శయించు వారకి చూచువాడు, చూపు, చూడబడునది, వీని లయము ఏ స్థలము నందగునో ఆ స్థలమునందే లక్ష్యము నిలుపనగును గాని ముక్కు కొన పై చూపును నిలుపగూడదు.

**వివరములు :**

ఏదేది కనిపించుచున్నదో యది యంతయును దృశ్యము, జ్ఞాన రూపమై తెలుసుకొనునట్టిదియేదో అదియే దృక్కు. అదియే బ్రహ్మము. కేవల జ్ఞానమార్గ వస్తువగు దృక్కే సర్వదేశ సర్వకాల సర్వ వస్తువులందు పరిపూర్ణముగా నిండి (నువ్వులలో నూనే రీతిగా) సర్వాధిష్టానమై సర్వాధారమై వెలుగుచుండుట వల్ల మరియు దాని యందుండు సర్వ చరాచర జంతు జాలములు పుట్టుచుగిట్టుచు మహాప్రళయమున దాని యందు ప్రవేశించి లయ మొందుట వల్ల ఆ దృక్కే బ్రహ్మమనబడును. దేవ, మానవ, పశుపక్షిక్రిమి కీటకాది సకల చరాచర జంతువులును ఆకాశాది పంచభూతములున్ను దేనియందు పుట్టునో, దేని సత్తా మాత్రము చేత జీవించుచుండునో మరల మహాప్రళయంబున సకలము దేని యందు ప్రవేశించి లయించునో ఆ వస్తువే బ్రహ్మము యనబడును. "యతోవా యిమాని భూతాని జాయంతి ఏనజాతాని జీవంతి యత్ప్రయంత్యభిసం విశంతి, తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి॥ తైత్తీరేయోపనిషత్॥ బహ్మము దృక్కనియు సంవిత్తనియు, చిత్తనియు, జ్ఞప్తియనియు, జ్ఞాపకమనియు, బోధయనియు, చైతన్యమనియు, పలువిధములైన శబ్దముల చేత వాదబడుచున్నది.

ఆ పరబ్రహ్మగు దృక్కు ఏవిధమైన శరీరములు లేనిది. సచ్చిదానంద రూపమైనది. అనగా సత్తు, చిత్తు, అనందములే స్వరూపలైనవి. దృక్కు అనగా జీవ సంబంధమైన జ్ఞానము. దృశ్యమనగా జీవున కెరుకై నట్టి సకల ప్రపంచము. దృక్కు దృశ్యములు ఏక వస్తువే గనుక వివేకమని. అదిష్టాన భేదన బ్రహ్మమని మత కర్తలు నిర్ణయించినారు. ఈ పద్ధతి తెలసినవారికి జన్మ రహితమగునని మానవ లోకమును భ్రాంతిలో ముంచినారు. దీనికి ఈ దిగువ దృష్టాంతము సరిపోవును.

నగలు చేయుటకు కంసాలి చేయవలసిన నగ యొక్క ఆకారము అంతః కరణమున నిర్ణయించుకొని బంగారమును అంతఃకరణమున నిర్ణయించుకొన్న ఆకారముగా మలిచి ఆనందించిన విధముగా నున్నది. కనుక ఈ దృగ్దృశ్య వివేక నిర్ణయము సత్తు చిత్తు ఆనంద రూపబ్రహ్మము. జనన మరణ పద్ధతి గల ఉపాధి ప్రళయ మొందునది గాని జనన మరణములు ఉత్పత్తి ప్రళయము లేని అచల పరిపూర్ణ పరబాహ్యము గాదు. కనుక దృగ్దృశ్య వివేకము "కల"యని నిర్ణయము.

సాధారణముగా ఏవస్తు నైనను చక్కగా నవలోకనము చేయునపుడు చూచువాడు ద్రష్ట, చూపు దృక్కు, చూడబడిన వస్తువు దృశ్యము అనె త్రిపుటి యుండదు. తాను,

తన మనస్సు ఆ వస్తు రూపమే అయిపోవును. ఇదే వస్తుసాక్షాత్కారము.

"బ్రహ్మము యింద్రియ గోచరము కాదు గదా! స్వరూప సాక్షాత్కారమెట్లు చేకూరును. వస్తు సాక్షాత్కారవిషయమున వృత్తి వ్యాప్తి, ఫలవ్యాప్తి యను రెండు భేదములు గలవు. ఫలవ్యాప్తి యనగా వస్తువు యెదుట నున్న ఘటమువలె కనులకగుపడును. ఘటము కనబడగనే అంతః కరణ ప్రతిబింబితుడగు చిదాభాసుడు దానిని యిది "ఘట" మని ప్రకాశింపజేయును. వృత్తివ్యాప్తి బ్రహ్మము విషయములో యిట్టి వృత్తి కలుగుట లేదుగాని మనస్సు నందు వస్తు విట్టిదని మాత్రము గోచరించును. దీనినే వృత్తివ్యాప్తియందురు. శ్రుతి॥ "ఏష సర్వేషు భూతేషు గూడోత్మాన ప్రకాశతే, దృశ్య తేత్వ గ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః" కఠ॥ చూడుము పరిపూర్ణదర్శనము పుట. 128.

**శ్లో॥ అంతఃపూర్ణం బహిః పూర్ణం । పూర్ణకుంభమివాంభసి**
**అంతఃశూన్యం బహిః శూన్యం । శూన్యకుంభమివాంభరే॥ 5॥**

తా॥ సముద్ర జలమునందు మునిగియుండు కుండ లోపల వెలుపల నీరు పూర్ణముగా వ్యాపించియుండునట్లు బ్రహ్మము బ్రహ్మాండమునకు లోపల వెలుపల అంతట వ్యాపించి యున్నది. ఆకాశము (బయలు) నందు గల కుండలోపల వెలుపల మాయ శూన్యమే యగును.

**వివరములు** : బ్రహ్మము యనగా బహు పెద్దది. అంత కంటే పెద్దది లేదన్నమాట. అది విశ్వగతము విశ్వాతీతము. పృథివ్యాపస్తేజోవాయురాకాశము లన్నియు ఉత్తరోత్తరం యధి కాధికములై యున్నవి. పరమాత్మ సర్వవ్యాపకమై యున్న ఆకాశమును కూడ నతిక్రమించి యున్నది. ఇదే గురు స్వరూపము అని సార్థక నామముచే నొప్పుచున్నది. లఘుస్వరూపుడు (అంశ స్వరూపుడు అణుస్వరూపుడు) అగుతాను వుపాధి ంహతము నందు గురుస్వరూపుడు పూర్ణస్వరూపుడు లేక విభుస్వరూపుడు అయి వున్నాడు. జగద్రూపముగా కనబడునది తాత్వికముగా బ్రహ్మమే. దాని నామరూపములు మిథ్య. ఉన్నదంత ఈ బ్రహ్మ స్వరూపమే. నేను నాకు తోచబడే ఈ దృశ్య రూప జగత్తు మొత్తమంతయు కృత్స్నము, పూర్ణము నగుబ్రహ్మమే. ఇదే బ్రహ్మాభావము. "ఏకమే వాఽ ద్వితీయం బ్రహ్మ" "నేహనా నాస్తి కించన" సర్వంఖల్విదంబ్రహ్మ", "అయమాత్మ బ్రహ్మ", "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" ఇత్యాది శ్రుతి వాక్యములు నాతోగూడ సర్వము బ్రహ్మమేనని ఘోషించుచున్నవి. ఈ బ్రహ్మము సముద్రము నందు నీటిలో

మునిగిన పూర్ణకుంభమునకు లోపల వెలుపల ఏవిధంగా వ్యాపించియున్నదో అట్లే బ్రహ్మము బ్రహాండము నకు లోపల వెలుపల వ్యాపించియున్నది.

బ్రహ్మము పూర్ణమని తెలుసుకొన్న తర్వాత మాయా, ఆకాశము నందు కుండ లోపల వెలువల ఎట్లు శూన్యమో గమనించవలసియున్నది. "యామాసామాయా" యని మాయకు నిర్వచనము. ఏది ఒకప్పుడండి ఒకప్పుడు లేకుండునో యదే మాయ యని అర్థము. అంటే ఎల్లప్పుడు వుండేది ఒకటి, ఒకప్పుడు మాత్రమే వుండి, ఒకప్పుడు లేకుండ యుండునది ఒకటి యని, రెండు వస్తువులను చెప్పినట్లుయినది. ఈ రెండవ వస్తువు (మాయ) వున్నప్పుడు ఎక్కడ వున్నది? పోయినప్పుడెందు పొయినది? అంటే అద్వైత నిర్ణయ రిత్యా పరబ్రహ్మమొక్కటే ఎల్లప్పుడు వుండేది. కనుక దాని యందేతోచి, దానియందే వుండి, దాని యందే మరల లేకుండపోవునని చెప్పబడుచున్నది. సృష్టికి పూర్వము అసలు లేనే లేనట్లు తోచుచున్నది. సృష్టి ప్రారంభ కాలమున బ్రహ్మము నందు తోచి, ఆ బ్రహ్మము యొక్క సానిధ్యమందు చేతనవంతమై బ్రహ్మముతో గూడి జీవేశ్వర జగత్తుకు కారణమైనట్లు చెప్పబడినది. మాయగాని తత్కార్యములు గాని బ్రహ్మ నుండి కల్గినవి కదా! ఉండి కలిగనవా? లేక కల్గినవా? అను ప్రశ్న వుదయిస్తున్నది. గండ ఇసుక గానుగ వేస్తే తైలములభించునా? కనుక లేక కలిగినదని యనరాదు. వృక్షకారణము బీజమునందణిగి మణిగి యున్నట్లే జీవేశ్వర జగదాది మాయా కార్యములు సహితము బ్రహ్మమునందు బీజరూపముగా యణిగి మణిగి యున్నవని చెప్పక తప్పదు. పరిపూర్ణపరబ్రహ్మ నిర్ణయములో మాయ, బ్రహ్మము లేకనే కల్గినవి కాని ప్రస్తుత విచారణలో మాత్రము ఉండి కల్గినదని చెప్పవలెను. మరుగైయున్నది ప్రకటమై యున్నదని చెప్పాలి. ఎక్కడ దాగియుండెనో అక్కడే ప్రకటమై అక్కడే యుండి తిరిగి అక్కడే తిరోభావము చెందినవి. కాని అసలు వున్నదెప్పుడు? లేనిది క్రొత్తగా రాను లేదు. ఉన్నది పోకుండ పోనుపోదు! పగలు నక్షత్రాలు కానరానంతమాత్రాన నక్షత్రములు లేనే లేవనుట ఎట్లు పొరబాటో, అట్లే అధిష్ఠాన చేతన బ్రహ్మములో మాయ అనిత్యమని, బ్రహ్మము నిత్యమని యనరాదు. ఎటొచ్చి మాయాది గుణములు ఆ బ్రహ్మము నందు అవిర్భావ తిరోభావములు చెందుచున్నవే గాని బ్రహ్మమున కన్యదేశమున లేవు. మరియు "బ్రహ్మణోన్యం నకించన" అనగా ఆబ్రహ్మమునకు అన్యముగా కొంచముకూడ ఏమి లేదని. "సర్వఖల్విదం బ్రహ్మ" అంటూ అంతాబ్రహ్మ స్వరూపమని శ్రుతులు చెప్పుచున్నవి. కనుక మాయా బ్రహ్మములు రెండు బ్రహ్మము యొక్క రూపాంతరములే అనాలి.

మాయాదులు అనిర్వచనీయమనీ, ఆది శంకరులు, వివేక చూడా మణిలో ఈ క్రింది విధముగా అభివర్ణించినారు.

శ్లో॥ సన్నాప్య సన్యాప్యు భయాత్మికానో।
భిన్నాప్య భిన్నాప్యు భయాత్మికానో॥
సంగాన్య సంగాన్యు భయాత్మికానో
మహోద్భుతా నిర్వచనీయ రూపా॥

అనగా మాయ సదసద్రూపంగాను, భిన్నభిన్న రూపములు గాను సాయవ నిరవయ రూపములు గాను యుంటు యిదమిత్థమని నిర్ణయింప రాక అనిర్వచనీయమై మహా అద్భుతమైయున్నదని భావము. కాని ఆ మాయా బ్రహ్మములు రెండు ఒకే వస్తువు. ఒకే నాణెము యొక్క బొమ్మ - బొరుసుల వంటివి. బ్రహ్మము నందలి దైవాత్మక శక్తి లేక బ్రహ్మ శక్తయే మాయా శబ్దముతో చెప్పబడినది. అధిష్ఠాన బ్రహ్మము సృష్టికి పూర్వము ఒక విధంగా నుండి తానే జీవేశ్వరజగత్తును అవిర్భవింపజేసి తన కన్యంగా నున్నట్లు తోపింపచేసి తుదకా జగన్నాటకమున కుపసంహారము చేసేది యధిష్టాన బ్రహ్మమే. కనుకనే శ్రీ కృష్ణదేశికేంద్రలవారు తమ కందార్థములో క.ద. 50 అన్నియు తానై। తన కవి పన్నుగ వేరనుచు నోట బలుకుచు మరి తానన్నిటి యెరిగె యెరుకై యున్నానని యెరుగేనెరుక! నూహింపుచుండగా। తనలో తాను మోహింపుచుండూ" అని క.ద. 52 "ఆటాడి ఆడకుండును। ఆటాడిన మేను బొమ్మ యాటాడ కనే। ఆటాడు ఎరుక యని యెడి। ఆటాడించెడి వాడు యతడేరా కర్త అంతటకీ యీ అచల మకర్తా। అని సెలవిచ్చి యున్నారు.

కనుక ఈ అధిష్ఠానము చేతన బ్రహ్మ కంటే అద్భుతమైనది అనిర్వచనీయమైనది మరొకటి లేదు. దీని కిదేసాటి.

**శ్లో॥ ఈశానస్సర్వ విద్యానాం। మీశ్వర సర్వభూతానాం**
**బ్రహ్మోధిపతి ర్బ్రహ్మణోధిపతి। ర్బ్రహ్మాశివోమె అస్తు సదా శివోం ॥6॥**

తా॥ శివుని పంచముఖములో ఈశాన ముఖము (ఊర్ధ్వముఖము) యొకటి కనుక శివుని ఈశానుడందురు. అట్టిసదాశివుడు సకల విద్యలకు, సర్వభూతములకు నాథుడు, ప్రభువు. ఇతడు బ్రహ్మకు అధిపతి, బ్రాహ్మణులకధిపతి. అట్టి సదా శివుడు నాకు శుభముల నొసగుగాక!

**వివరములు:** పరమశివునకు ఐదు ముఖములు కలవు 1. సద్యోజాత (పశ్చిమ) ముఖమును ఆవిర్భవ **న**కార ప్రధానము 2. వామదేవ (ఉత్తర) ముఖమును ఆవిర్భవ **మ**కారప్రధానము 3. అఘోర (దక్షిణ) ముఖమును ఆవిర్భవ **శి**కార ప్రధానము, 4. తత్పురుష (తూర్పుముఖమును) ఆవిర్భవ **వ**కారప్రధానము, 5. ఈశాన (ఊర్ధ్వ) ముఖమును ఆవిర్భవ **య**కార ప్రధానముగా గలవు. శివపురాణము ప్రకారము ఈశానముఖం విలాసమయంగాను, తత్పురష ముఖం తపోమయంగాను, అఘోరమఖం సంహారకంగాను, వామదేవముఖం అహంకారముగాను సద్యోజాతముఖం జ్ఞానాత్మకంగా వుంటాయి ఈ ఐదు ముఖలను ఐదు మంత్రాలతో బద్ధమైన నమస్కారములతో ప్రసన్నం చేసుకోవచ్చును.

**ప్రథముఖము :**

ఓమ్ సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమో నమః
భవే భేవే నాతిభవే భవస్వమాం భవోద్భవాయ నమః॥

**ద్వితీయ ముఖము:**

ఓమ్ వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయనమో
రుద్రాయనమః। కాలయ నమః కలవికరణాయనమో।
బలవికరణాయ నమో। బలాయనమో బలప్రమధనాయ నమః।
సర్వభూత దమనాయ నమో మనోన్మనాయ నమః॥

**తృతీయముఖము:**

ఓం అఘోరేభ్యోఽథ ఘోరభ్యో ఘోర ఘోరతరేభ్యః।
సర్వేభ్యః సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః॥

**చతుర్థముఖమ:**

ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి
తన్నోరుద్రః ప్రచోదయాత్

**పంచమముఖము:**

ఓమ్ ఈశానః సర్వవిద్యానాం ఈశ్వరః సర్వభూతానాం బ్రహ్మాధిపతిః బ్రహ్మణోధి పతిః బ్రహ్మాశివోమే అస్తు సదా శివోమ్॥

శివుని కఠిన శాసనములతో సర్వజగత్తు నియమము తప్పకుండ నడుస్తుంది.

శ్రీ శంకరాచార్యులు "కుహరే పంచముఖోఽ స్తిమేకుతోభిః" అని సదాశివుని ప్రార్థించి

యున్నారు. అనగా ఐదుముఖములు గలవాడును అగు సాంబసదాశివుడు సహాయకునిగా నా మనస్సునందు గలడు. కావున నాకుభయము లేదు. స్వరూపజ్ఞానము నొంది "అహంబ్రహ్మాస్మి" అని అనుభవ పూర్వక జ్ఞానము నొందిన జీవుడు బ్రహ్మమే యగును. అప్పుడు అద్వైతికి భయమేమియుండదు.

శ్రీ శంకర భగవత్పూజ్య పాదులు శివానంద లహరి మొదటి మంగళా చరణ శ్లోకమునందు "కలాభ్యాం" యని పేర్కొన్నారు. అనగా సకల విద్యాస్వరూపులగు పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించినారు.

తైత్తిరీయారణ్యకమున "ఈశ్వర సర్వ విద్యానాం" అని కలదు. వేద శాస్త్రాగమ పురాణ సర్వవిద్యలకు పరమేశ్వరుడు అధిపతియని భావము.

అకారాది అచ్చుల స్వరూపిణియగు పరాశక్తియు చేరుట వలననే వర్ణములు, పదములు, సమాసములు మంత్రములు, వేదములు మొదలగునవి "యుత్పన్నములైనవి వా రిద్దరు శబ్దార్థ స్వరూపులు కావుననే మహాకాళిదాసు:

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే

జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥"

తా॥ శబ్దార్థము వలె ఎడతెగని సంబంధము కలవారై లోకములకు తల్లి దండ్రులగు పార్వతీ పరమేశ్వరులను శబ్దార్థ జ్ఞానము కొరకు సమస్కరింతును అని అన్నారు.

శివానుగ్రహేణ జ్ఞాన ప్రాప్తిః "అని ఉపనిషద్వాక్యము అనగా సాంబసదాశివుని దయవలననే జ్ఞానము లభించును.

"ఆనంద స్ఫురదనుభవాభ్యాం" ఆనందముతో ప్రకాశించువారు యనగా శివాశివులు ఆనంద స్వరూపులు. వారు భక్తులయెడ అనుగ్రహించి, స్వస్వరూపమును తెలుసుకొను ఆత్మజ్ఞానమును యిత్తురు.

"ఆనంద స్ఫురదనుభవాభ్యాం" ఆనందముతో ప్రకాశించువారు యనగా శివాశివులు ఆనంద స్వరూపులు. వారు భక్తులయెడ అనుగ్రహించి, స్వస్వరూపమును తెలుసుకొను ఆత్మజ్ఞానమును యిత్తురు.

మన ఇండ్లలో మన పిల్లలకు విద్యాభాసము ప్రారంభించు సమయమున "ఓం

నమః శివాయ" యని పలకపై వ్రాసి పిల్లవానిచే పలికించుచు దిద్దించెదము. ఇట్లు చేయుటలో శివుడు విద్యలన్నిటికి దేవుడు. తమ పిల్లలకు అన్ని విద్యలను ప్రసాధించుటకు గాను ఆ శివుని ప్రార్థన గావించుటలో పరమార్థ మిదియే.

వామదేవాయ = వామదేవః వామం కామం దీవ్యతి విజిగేషతీతి వామదేవః = కాముని జయించాలను కొన్నవాడు వామదేవుడు. ఈశానాయ = ఈశానః =ఈశానః సర్వవిద్యానాం స్వామి – ఇతి శ్రుతేః సర్వవిద్యలకు ప్రభువు కనుక ఈశానుడు. సర్వవిద్యలకు ఈశానుడు అని వేదం దీనికి ప్రమాణము.

**ఈశ్వర సర్వభూతానాం:** ఈశ్వరుడనగా బ్రహ్మము సృష్టి స్థితిలయములకు గారణమైనప్పుడు ఈశ్వరుడని పేరు. ఇంకాకొంత విపులముగా జెప్పాలంటే స్వరూప స్వభావములచే మాయాతీతుడై నిర్గుణుడై నిష్క్రియుడై యున్న బ్రహ్మము నిర్గుణ బ్రహ్మమనియు, తటస్థ భావమున మాయ కబళితమై యున్న బ్రహ్మ చైతన్యము లేక ఈశ్వరుడు యనియు, సగుణ బ్రహ్మమనియు యందురు.

సమిష్టి అజ్ఞానస్వరూపమై సత్వగుణ ప్రధానమై యుండు మాయయందలి చిదాభాసమును మాయా సహిత చైతన్యమును గూడి ఈశ్వరుడనబడును. సత్వగుణ రూపమై యున్న ఈశ్వరో పాధియగు మాయ యందు ఆవరణ విక్షేపములు ప్రబలమై యుండనందున ఈశ్వరుడు సర్వజ్ఞుడును, స్వతంత్రుడును, నిత్యముక్తుడై వున్నాడు.

"ఈశ్వర సర్వభూతానాం" అనగా ఈశ్వరుడు సర్వభూతము లందు అధివసించు చున్నాడు. "శివుడంటే వాడేమి దూరమునలేడు, మనలోనున్నాడు మనకు కానరాడు" అనుటలో శివుడు మన లోపలయున్నాడు. మరియు "జీవుడు దేవుడు వుభయులు భావించక దేహమందు పదవడియుండన్, జీవుని గుణములు మానితే, జీవుండే దేవుడాయె చెప్పగలనేల" అనియు "ఈశ్వర సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్టతి । భ్రామయన్ సర్వభూతాని యన్త్రా రూఢాని మాయయా"॥ (గీత 18.61) అనగా ఈశ్వరుడు దూరముగా యున్నాడని తలంచుట వెఱ్ఱి. అతడు జీవులకు అతి సమీపమున హృదయ మందు (ఆత్మరూపమున) అధివసించుచున్నాడని కృష్ణభగవానుడు జెప్పుచున్నాడు. కనుక ఎల్లప్పుడు భగవత్సాన్నిధ్యము ననుభవింపుము. పాపకార్యములు చేయక భక్తితో మెలుగువలెను. జీవులు చేయు సమస్త కార్యములను, సంకల్పించు సమస్త సంకల్పములను ఈశ్వరుడు సాక్షిమాత్రుడై సదా వీక్షించుచునే యుండు నని మరువరాదు. "తానెరుగకున్న ఈశ్వరుడెరుగడా". ఈశ్వరుడనగ ప్రభువు, శాసకుడు, నియామకుడు.

రాజు ప్రజలను శాసించునట్లు అతడు సమస్త ప్రాణికొట్లను శాసించును. వారి వారి కర్మానుకూలముగా ఫలము నొసంగును. రాజాజ్ఞను మీరినచో జనులకెట్లుదండనము లభించునో, అట్లే ఈశ్వరుని ఆజ్ఞయగు ధర్మము నుల్లంఘించినచో మనుజు డాతనిచే శిక్షుతుడై తన దుష్కర్మ ఫలితమను ఘోర దుఃఖము ననుభవించును. కావున హృదయమున, బాహ్యమున సర్వత్ర ఈశ్వర సన్నిధిని సదా భాసించుచు ధర్మమును, సత్యమును, ఎవరు ఉల్లంఘించరాదు.

భగవంతుడు వైకుంఠము నందో, కైలాసమునందో మరియు పదునాల్గు లోకమలందే గాక అతడెల్లడల వసించుచుండును. అతిసమీపమున గల హృదయమందు నివసించి యున్నాడు. "సర్వభూతానామ్" అని చెప్పుటచే ఏ వొకానొక ప్రాణియందో కాక సమసమస్త జీవకోట్ల యందు భగవానుడు వెలయుచుండను. కాబట్టి చీమ యందు దోమయందు పశువులందును చండాలునియందు కూడ అతడు నివసించియున్నాడు. "తేనే వినాతృణాగ్రపినచలతి" "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను శ్రుతులు ఈభావమును ఇంకా దృఢము చేయుచున్నవి. కావున అట్టి పరమాత్మను సదా భక్తితో కొలువుము.

**బ్రహ్మాధిపతి :** ఈశ్వరుడు బ్రహ్మకు (అధిష్ఠాన చేతన బ్రహ్మకు) అధిపతి. బ్రహ్మణోధిపతియనగా సకల దేవతలకు అధిపతియని చెప్పబడినది. "బ్రహ్మణోన్యం నకించన" అని శ్రుతి చెప్పుచున్ననట్లు అన్నియు బ్రహ్మమే, అందురు బ్రహ్మస్వరూపులై యున్నారు. కాని స్వరూప విస్మృతి చెంది యున్నారు. అట్టి విస్మృతి (లేక మరువు) కలుగుటకు కారణము వారి అంతఃకరణము అజ్ఞానముచే ఆవరించబడుటయే. చిమ్నీకి దట్టమగుపొగ పట్టినచో లోనున్న దీప ప్రకాశము ఎట్ల కాంతి హీనమగునో అట్లే స్వస్వరూప జ్ఞానము మరుగుపడి తానొక కించిజ్ఞుడు, క్షుద్ర జీవిగా మానవుడు తలంచును. నేను (నేను ఆత్మనే, లేక బ్రహ్మమే) అను దాని నిజరూపము మరుగుపడి స్థూల సూక్ష్మ కారణ శరీరములతో తాదాత్మ్యముచెంది వాని సుఖదుఃఖములు తనవిగానే తలంచి మానవుడు బద్ధుడగుచూన్నడు. తాను నిత్యముక్తుడను విషయము పూర్తిగా విస్మరించుచున్నాడు. అధవా తానాత్మస్వరూపుపుడనే అనుమాట చెవిని పడినా ఆ భావమును జీర్ణంచుకొని ఆరూఢత సాధించలేకున్నాడు. గురుమూర్తి ఆత్మవస్తు పరిజ్ఞానము కలిగించవలయును. గూరూపదిష్ట మార్గమందు శిష్యుడు పయనించవలెను. 'గురు కృపచే అట్టి అనుభవజ్ఞానము సాధించవలెను. అప్పుడు ఆ విస్మృతి, మరుపులేక

అజ్ఞానము పోయి ఆ జ్ఞానము అంతఃకరణము ఉపరిభాగముననే కప్పియుండుటగాక లోపలపైన అను భేదము లేక అంతఃకరణము జ్ఞానమయమై పోవును. అప్పుడు అతడు బ్రహ్మననే జ్ఞానము కలుగును. "తేనే వినా తృణాగ్రమపి నచలతి" అనగా నేను లేక గడ్డిపోచనైనకదలదను అనుభవమునకువచ్చును. వ్యష్టిజ్ఞానం నశించి సమిష్టజ్ఞానం కలిగి బ్రహ్మస్వరూపుడగును. అట్టి బ్రహ్మస్వరూపమైన చరాచరములన్నిటికి ఈశ్వరుడే అధిపతియని తెలియవలయును. అట్టి సదాశివుడు నాకు శుభముల నొసగు గాక!

**శ్లో॥ వాక్పూర్ణ సహనాప్యాయం। భద్రం కర్ణేభి రేవచ।**
**పంచశాంతీః పఠేద్యాదౌ। పఠేద్వాక్యాన్య నంతరం॥ 7.**

తా॥ వాక్కు, పూర్ణం, సహన, అప్యాయ, భద్రం, కర్ణేభిః అను పంచశాంతుల జేయవలయును. పిమ్మట వాక్యాంతముల పఠించ వలయును.

**వివరములు** : వేద శిరస్సులనబడు ఉపనిషత్తుల పఠనమునకు శాంతి మంత్రములు నిర్ణయించినారు. ఉపనిషత్తు శ్రవణాది అంత్యములందు అనగా పఠనమునకు పూర్వ మందు, పఠనమునకు తరువాత శాంతి మంత్రములను పఠించవలయును. అట్లు పఠించనివారికి ఉపనిషత్పఠనము యొక్క శ్రమయేమిగులును కాని ఫలముండదు. కనుక శాంతి పాఠమునందలి నిర్ణయ విధానము తెలుసుకొని ఆ పద్ధతిగా ఆచరించడము ముముక్షువు యొక్క ధర్మము.

1. ఋగ్వేదశాంతి: ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా.
2. శుక్లయజుర్వేదశాంతి: పూర్ణమదః పూర్ణమిదం.
3. కృష్ణయజుర్వేదశాంతి: సహనావవతు.
4. సామవేదశాంతి: ఆప్యాయంతు.
5. అధర్వణవేదశాంతి: భద్రం కర్ణేభి.

వేద శిరస్సులను ఉపనిషత్తులకు శాంతి పాఠములను ఎందుకు నిర్ణయించినారో మందుగా తెలుసుకొందము.

అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక విఘ్నముల యొక్క పరిహార నిమిత్తము మరియు గురు శిష్యుల నిద్దరినీ చైతన్య బ్రహ్మ భ్రాంతి సముదాయములో బడనీయక. అహం బ్రహ్మాస్మియని. భ్రాంతి సమాప్తి కొరకు శాంతిః శాంతిః శాంతిః అని ముమ్మారు చెప్పనైనది.

1. **అధ్యాత్మికమనగా :** శరీరము నాధారము చేసుకొని పుట్టినట్టి జ్వరము, తల నొప్పి, వ్రణము మొదలగు వాని వలన గలిగే తాపములు.

2. **అధి భౌతికము :** తేలు, సర్పము, పులి, సింహము, యితర జంతువుల వలన కలిగే బాధలు.

3. **అధి దైవికములనగా :** దైవ వశముగా పిడుగు, భూకంపము మొదలగు వాని వలన కలుగు తాపములు.

4. **చైతన్య భ్రాంతి సప్త విధములు:**

   1. శుద్ధ చైతన్యము - మాయోపాధిరహితమైన చైతన్యము.
   2. ఈశ్వర చైతన్యము - మాయోపాధితోకూడిన చైతన్యము.
   3. జీవ చైతన్యము - అవిద్యోపాధితో కూడిన చైతన్యము.
   4. ప్రమాత చైతన్యము - అంతఃకరణతో కూడిన చైతన్యము.
   5. ప్రమాణ చైతన్యము - అంతఃకరణ వృత్తితో కూడిన చైతన్యము.
   6. ప్రమేయ చైతన్యము - మరుపురూపము అనగా ఎరగబడని చైతన్యము.
   7. ఫల చైతన్యము ఎరుగబడిన చైతన్యము.

ఈ ప్రకారముగా అధిష్ఠాన చేతన బ్రహ్మమగు ఆత్మ, ఉపాధిచేత అనేక విధములుగా చెప్పబడుచున్నాడు. ఉపాధిని త్రోసివేసి అద్వితీయుడై పరిపూర్ణుడైన ఆత్మను నేనే నని యెవ్వడెరుగుచున్నాడో వాడు ముక్తుడని వేదాంత శాస్త్ర సిద్ధాంతము.

ఈ నిర్ణయముల విధానము భ్రాంతిగా వున్నందున శాంతులను నిర్ణయించినారు.

మహబూబ్‌నగరము జిల్లా వాస్తవ్యుడు, మెణుసు (సిద్ధాంతముని) గోత్రికుడు మంత చిన్నమ్మ మంత ఎల్లప్ప పుణ్యదంపతుల పుత్రుడు, శ్రీ మదచలఋషి మల్లు వెంకటరెడ్డి దేశిక ప్రభువుల శిష్యుడు, బుధజన విధేయుడైన ఇప్పటూరి మంత చిన్నయ్య చే గురువాక్యోపనిషత్తు నకు వ్రాసిన తాత్పర్యములు, కూర్చిన వివరములు సమాప్తము.

ఇతిసర్వం శ్రీ సద్గురు చరణారవిందార్పణ మస్తు!

# అనుబంధము

**శాంతి పాఠములు:**

**1.ఋగ్వేద మహా వాక్యశాంతి :**

శు|తి॥ ఓం వాఙ్మేమనిసి ప్రతిష్ఠితా!
మనోమే వాచి ప్రతిష్ఠితమ్
అవిరా వీర్మ ఏధి!
వేదస్యమ అణీస్థ
శ్రుతం మేమా ప్రహాసీః
అనే నాధీతె నాహోరాత్రాన్
సందధామి! ఋతం వదిష్యామి
సత్యంవదిష్యామి! తన్మామవతు!
తద్వక్తార మవతు! అవతుమాం
అవతువక్తారమ్! అవతువక్తారమ్॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

**భావమ :** నా వాక్కు మనస్సు నందును, నా మనస్సు వాక్కునందును ప్రతిష్ఠత మగుగాక! బ్రహ్మము నాకు దర్శన మొసంగుగాక! వేద ప్రతిపాదిత సత్యమును సామర్థ్యము గల మనో వాక్కులను నా కొసంగుగాక! నేను వినిన విషయము నన్ను వదలకుండుగాక! దివారాత్రములు నేను విద్యనభ్యసించెదను గాక! నేను సత్యము నే మాట్లాడుదును! సత్యమునే ఆలోచింతును! సత్యమే నన్ను రక్షించు గాక! సత్యమే నాగురువును కూడ రక్షించుగాక! నన్ను రక్షించుగాక! గురువును రక్షించు గాక! గురువును రక్షించు గాక!

**2. కృష్ణయజుర్వేద మహావాక్య శాంతి :**

శ్రుతి॥ ఓం సహనావవతు। సహనౌ భునక్తు।
సహవీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు। మా విద్విషావహై॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

**భావము :** సచ్చిదానంద స్వరూపియగు పరబ్రహ్మము గురు శిష్యులగు మమ్ములను కాపాడునుగాక! ఆ పరబ్రహ్మము సదా బ్రహ్మ విచారము నందే కాలము గడుప యిచ్ఛగల

మా యందు ప్రీతి నుంచును గాక! ఆ పరబ్రహ్మకటాక్షము వలన వేదాంత శ్రవణ మననాదులను పొందుటకు మాకు వీర్యము కలుగు గాక! స్వయం జ్యోతి యగు ఆత్మానుభవము మాకు కలుగును గాక! గురు శిష్య రూపులైన మాకు ద్వేషము మొదలగు దుర్గుణములు లేక పోవును గాక! ఇట్లు ప్రార్థనా పూర్వకముగా ముందు పఠించబోయెడి వాక్యముల యొక్క విఘ్ననాశనము కొరకు శాంతినిజేసి అవిఘ్నముగా శిష్యుని చేత బ్రహ్మ విద్యావ్యాప్తి కోరబడుచున్నది యని తాత్పర్యము.

### 3. సామవేద మహావాక్యశాంతి :

శ్రుతి॥ అప్యాయంతు - మమాంగాని - వాక్ప్రాణశ్చక్షు శ్రోత్రో - మధోబల - మింద్రియాణీచ - సర్వాణి సర్వం - బ్రహ్మోపనిషదం - మాహం - బ్రహ్మ - నిరాకుర్యాం। మామా - బ్రహ్మ - నిరాకరో - దని నిరాకరణం - మే - అస్తు। తదాత్మని - విరతే - య - ఉపనిషత్సు - ధర్మా! స్తేమయి - సంతు - తే మయి - సంతు - తే - మయి - సంతు - తే - మయి - సంతు।

ఓం శాంతిః శాంతిః శాంతిః

**భావము** : నా యొక్క అంగములు, వాక్కు, నేత్రము, శోత్రము (చెవి) మనస్సు మొదలగు సర్వేంద్రియములు విషయాదులందు ప్రవర్తించక బ్రహ్మమగు ఆత్మ స్వరూపము నందు నిలిచి తృప్తిని పొందు గాక! వేందాత ప్రతిపాదితమగు సచ్చిదానంద పరబ్రహ్మము సర్వ స్వరూపిణియగును గాక! ఆత్మ స్వరూపుడ నగు నేను ఆ పరబ్రహ్మమును నిరాకరించ కుందును గాక! ఆపరబ్రహ్మము ఆత్మ స్వరూపుడగు నన్ను నిరాకరించకుండును గాక! ఆ పరబ్రహ్మము యొక్క ఆదరము నాకు కలుగుగాక! నాకు ఆ పరబ్రహ్మమందు విశ్వాసము, అలక్ష్యభావము కలుగకుండుగాక! ఆ పరబ్రహ్మము నందు ఆసక్తి గలనాయందు ఉపనిషత్తులచే చెప్పబడినట్టి ధర్మములుకలిగి యుండునుగాక! ఆ బ్రహ్మమును అపేక్షించిన తన యందు వేదాంతములందు చెప్పబడిన శమదమాదులు కలిగియుండుగాక! యని అప్యాయంతు యని శాంతిని ఉచ్చరించుట అధ్యాత్మిక, అధిభౌతిక అధిదైవికములైన విఘ్నముల పరిహార నిమిత్తమని తాత్పర్యము.

## 4. అధ్యర్వణవేద మహా వాక్యశాంతి

శ్రుతి॥ ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః।
భద్రం పశ్యేమాక్షభిర్య జత్రాః।
స్థిరై రంగైసుష్టు వాగ్ం సస్తనూభిః।
వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృరోహస్పతి ర్దధాతు॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

తా॥ ఓ దేవతలారా! మా చెవులు మంగళ ప్రదములగు ఆధ్యాత్మిక బోధలనే వినునట్లుగా అనుగ్రహింపుము. నా శ్రవణేంద్రియములను గురువాక్య ప్రబోధముల వైపు నకే పోవుటకు మరల్చుము. నేత్రము అనిత్యమైన సౌందర్యము చూచి భ్రమించును, కావున కన్నులు నిత్యనూత్నమగు ఆత్మ సౌందర్యమును చూచునట్లు చేయుము. సాత్వికాహారము చే దేహము బలిష్ఠమగు నట్లు అనుగ్రహింపుము. అదియే మనః శాంతిని చేకూర్చును. పరమార్థసాధనకు తగిన ఆయుర్ధాయము కల్గించుము. ఇంద్రుడు పూష గరుత్మంతుడు బృహస్పతి మొదలగు శిష్టా చార్యులు మాకు క్షేమము కలిగించుగాక! (మూడు సార్లు శాంతి చెప్పుట తాపత్రయ ములను తొలగించుట)

## 5. శుక్లయజుర్వేద మహావాక్యశాంతి

శ్రుతి॥ **పూర్ణమదః పూర్ణామిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే॥**

**భావము :** ఆ పరోక్షము పూర్ణము. ఈ ప్రత్యక్షము పూర్ణము. ఈ పూర్ణపద్ధతి వివరించి చూడగ ప్రత్యక్ష పూర్ణము ఎండ మావుల జలరూపకంగా లేకుండ పోవుచున్నది. పరోక్ష పూర్ణశాంతి కొరకు శేషించియుంటూయున్నది. కనుక యిందు నిర్ణయించిన శాంతి ప్రత్యక్ష పూర్ణము కొరకే గాని అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక యితర విఘ్నముల శాంతి కొరకు గాదు. అనగా వాఙ్మేమనసీశాంతి, సహనావవతత్ర్పతిశాంతి, అప్యాయంతుత్యతిశాంతి, భద్రం కర్ణేభిద్యతిశాంతి యను నాలుగు విధ శాంతులు అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక యితరవిఘ్నముల శాంతి కొరకు నిర్ణయించినారు.

పూర్ణమదః - యను ఈ శాంతిశ్లోకము జననమరణ రూప ప్రత్యక్ష పూర్ణశాంతి కొరకు నిర్ణయించినారు ఎందుకనగా జనన మరణరూప ప్రత్యక్ష పూర్ణము సప్త విధ చైతన్య పద్ధతులుగా ఉపాధులస్థానములయందు జనన మరణ రహిత పరిపూర్ణ పరబ్రహ్మమే యుండును గాని, జనన మరణ రూప చేతన బ్రహ్మము ఎండ మావుల వంటిదని, దాని శాంతి కొరకు ఈ శాంతి, ఏడు పూర్ణమను పదములతో కూర్చబడి యున్నది. కనుక పరిపూర్ణపరబ్రహ్మము ఆగమ నిగమ ఉపనిషత్సాగర మధితార్థ మవలిది, జననమరణము పొందనిది అచల పరిపూర్ణ పరబ్రహ్మమని నిర్ణయము.

## పరిపూర్ణ ప్రబోధ నిశ్చయము

గురుముఖతః1) పరిపూర్ణము, 2) లేనెరుకను యెరిగి 3) ఎరుకను వదులుట యే పరిపూర్ణబోధ.

### 1. పరిపూర్ణ పరబయలు శాశ్వతమైనది:

పరిపూర్ణము అవేద్యము అనగా తెలియరానిది, అసంగమనగా దేనితో కూడుకొననిది, అబాధ్యము అనగా కాలత్రయములందు మార్పులేక నొక్కతీరుగా నుండునది, అబోధ్యము అనగా బోధించుటకు వీలు కానిది, అది ఏమని చెప్పరానిది, అలక్ష్యము అనగా యే లక్ష్యము గానిది, అకర్తయనగా అందు కర్మలుగాని, కర్మ ఫలములుగాని లేనిది, అప్రమేయమనగా తెలిసికొన శక్యము గానిది, మితి చెప్ప వీలు లేనిది, అద్వయము అనగా ద్వయము కానిది, నిష్క్రియమనగా పనిచేయునట్టిది కాదు, నిరామయము అనగా ఎట్టి వ్యాధులు లేనిది, నిత్యమైనది యనగా శాశ్వతమైనదై, మరియు ఏకమై, క్రింద మీద లోన బయట దశదిశల యందంతట ములు గ్రుచ్చ సందు లేక నిండి నిబిడీకృతమై యున్నది.

### 2. లేనెరుక అశాశ్వతము, లేనిదే :

పరిపూర్ణపరబ్రహ్మము తప్ప నితరమైన దంతా లేనెరుక. ఎరుకకు ఎరుకేమూలము గాని వేరేమూలము లేదు. పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఎరుకకు మూలముగాని స్థానముగాని లేదు. కనుక ఈ యెరుక **తనయందే** తోచి తన యందే తాను లేక పోవుచున్నది. కనుక మూలము లేని దానిని **సత్యమ**నుటకు వీలు లేనందున దీనికి లేనెరుకని పేరు ప్రసిద్ధమైనది. పుట్టనే లేదని **కూడ** ఆ కారణము చేతనే అనవలసి వచ్చినది.

## 3. నేను లేననుట ఎరుక రహితము :

కర్తృత్వరహిత కర్మాచరణ యందు నీవు లేక పోదువు. గనుక కర్తృత్వరహిత కర్మాచరణముగా కర్మలోనరించుచు (అహం పదార్ధరహిత పద్ధతిగా) తనువు విడిచిననాడే, వేయించిన విత్తనము మరల మొలకెత్తనట్లు భ్రాంతి రహిత మగును. అనగా జన్మరహితమగును.

**శ్లో॥ అశరీరం సర్వదాఽ స్తి శరీరం రహితం సదా ।**
**అయమేవ సద్యోముక్తి రన్యదాభ్రమకారణమ్ ॥**

సర్వం శ్రీ మద్గురు చరణారవిందార్పణమస్తు.

సమాప్తము



### తత్వము

రాజ యోగి ధర్మమెరు గండి

రచన : వద్దెపల్లి వాసుదేవ రావు కోత్తవాడ, వరంగల్.

1. రాజయోగి ధర్మమెరుగండి జనులార మీరు చింతలేని బాటనడవండీ! రాజయోగి ధర్మమెరిగి చింతలేని బాట నడిచితే కర్మబంధము కాలిపోవును చావులేనీ చోటు దొరకును. ॥రాజ॥

2. జపతపములు జేతురేమండి? సద్గురుని కృపచే జపతపంబుల మర్మమెరుగండీ। జపతపంబుల
మర్మమెరిగి గురుని కృపచేమేలుకొంటే। నేనుతానను వాదభేదము లేక, నే,తా,తొలగిపోవును ॥రాజ॥

3. జ్యోతి రూపము జూతు రేమండి? ఈ జ్యోతి వెంట నున్న చీకటి। తెలియరేమండీ। జ్యోతి వెంట నున్న। చీకటీగురుని చేత తెలుసు కొంటే। తెలుసుకున్నా తెలివి కూడా - గురుని మేల్కచె లేకలోవును ॥రాజ॥

4. భజనలు బహుజేతురేమండీ? నిజ గురుని గానక తత్వమెట్లు తెలియబడు నండీ। గురునికొలచీ తత్వమెరిగీ గురుని కరుణకు పాత్రులైతే। మూలమాయ మాయమగును - రాకపోకలు లేకపోవును ॥రాజ॥

5. వ్యర్థ సాధన మానరేమండీ? సాధనలచేతను పరమ పదము తెలియ బోదండీ। మనసు చొరని పరమ పదము మనసుకెట్ల సాధ్యపడను? పూర్ణ గురుని కరుణబడిసితే - పరమపదము ప్రత్యక్షమగును ॥రాజ॥

6. జన్మ జన్మల ఫలముతెలియండి। జనులార మీరు జన్మలేని బోధబడయండి। ఈ ధర సికింద్ర పురమున వెలసిన శ్రీ రాజ యార్యుల శరణు పొందిన చాలునని వి. వాసుదేవరావు చాటెను. ॥రాజ॥

## కీర్తన

**రచన :** కంభాల గురుమూర్తి - రామ్‌నగర్

కట్టరా మనసును కట్టరా - గురువాక్యగోలుసుతో॥కట్టి॥

1. కట్టరా గురుపదము నందున - దిట్టముగ
గురువాక్యగొలుసుతో। నెట్టరా కామాది
గుణములు - గట్టిగా గురు గుట్టు దెలసియు ॥కట్టి॥
2. ఎట్టి తపసుల యోగికైనను - పట్టుబడుదుర
పూర్ణభావము। పుట్టు గిట్టులులేని గుహ్యము - గుట్టు
తెలుసిన పుట్టి గిట్టవు ॥కట్టి॥
3. కుక్కవంటి మాయమనసుర - చిక్కునా
గుణహీనులకునూ। చక్కగా గురు సన్నిధినియానిక్క
మెరిగియు నహము విడరా
4. మనసు నిల్వక మాయదొలగదు - భ్రాంతులుడుగక
బ్రహ్మమరయరు। గురుని జేరకమర్మమెరుగరు ధర్మ
మెరుగక కర్మవిడదుర ॥క॥
5. గురుని గొలచిన గుణములణుగును
మరువకెప్పుడు గురుని నామము। స్థిరముగును
పదస్మరణజేసిన - నిరతముల్ నిజముక్తిగలుగును॥క॥
6. తను మనంబులు ధనము జ్ఞానము - నసయమును
నర్పించగురునకు। అనిశమూ పరమార్థమందున -
తాను లేనని లక్ష్యముంచియు
7. బట్టబయలగు బ్రహ్మమును గురు - గుట్టు దెలసియు
గుర్తువీడిన। దిట్టముగ యీ భవముగిట్టును - దిట్టరీవై
పథము బాయక ॥క॥
8. ఆది యంత్యము లేని ద్వాదశి - అర్థమంతట
నిండియున్నది। సాధనముల కతీతమైనది
స్వామిదీక్షిత భావమిది గని ॥క॥
9. మూలమేమియు లేని షోడశి - కీలుగనుకొని శాంతి
నొందుము। కాలునీ బాపెదవు ననిశము యేలరా
నీకితర బోధలు ॥క॥
10. పరమ దేశికులప్పలార్యులు - పదకమలము
శరణపొందియు। గురుని మంత్రాగ్నిజ్వాలలలో గుర్తునే
దహియించివేయర ॥క॥

## తత్త్వము

**రచన :** యిలపకుర్తి వీరవెంకట రామ చంద్రరావు
(నార్సపురం)

**పల్లవి :** "నేను" అన్నది యేదిరా - అది - లేనిదేయని
నమ్మరా, వున్నదనుకొని నమ్మియికపూబిలో దిగబోకురా ॥నేను॥

1. నాదినాది యనుచునూ నగుబాటు పాలుగాకురా
నేనులేకుంటేను యింక నీది, నాది, యేదిరా ॥నేను॥
2. నేను నాది నీవుజగతి లేనిదేదో లెలియరా అదియె
అచలము, అదియెబయలు, అదియేపరిపూర్ణమ్మురా ॥నేను॥
3. ఉన్నదాని వుండ జూచి లేకున్న దానిని వీడరా
-జన్మకారణమట్లుబోతే జన్మలికనెట్లెత్తేపురా ॥నేను॥
4. గురుని పాదము బట్టి నీవు గుర్తు మూలము దెలియరా।
గురుని మంత్రము గొడ్డలగుచును
గోట్టివేయును వినుమురా ॥నేను॥
5. దీక్షితీయ దివ్యబోధిది తెలసి పూనుము సోదరా
రాజయోగిని గొలచి, ఫలము రామచంద్రుడు పొందెరా।
॥నేను॥

## దివ్యామృతము గ్రోలుమురా!

**రచన :** పూర్ణానంద కొండ మదుగుల వెంకటరెడ్డి, వెనిగండ్ల
(బృందావన మది అందరిదీ అనుమాదిరి.)

1. భాస్కరుడప్పుడు నాచేవిన్నది - పార్థాయిప్పుడు
వినుమిదెరా! ధీరునకెందుకు మోహము! వీడుము?
దివ్యామృతమును గ్రోలుమురా ॥భా॥
2. అమృతమ్మృతంబులు అత్మానాత్మలు - అఖిల
ద్వంద్వములు నేనేరా। అత్మానాత్మల క్వలిదచలము -
అర్జున నదిగోచూదుమురా ॥భా॥
3. వచ్చెడి పోయెడివాదును నేనని -
వదలక మదిలో నమ్ముమురా
రాకడ పోకడ లేనిది అచలము - శోకము మానియు
కనుగొనరా। ॥భా॥
4. పూనికతో కైవల్యదేహమున - పురుషోత్తమునిగ
మెలగుమురా। పూర్ణముగాంచిన, పురుషోత్తముదే -
మృగజలంబువలె మృగ్యమురా ॥భా॥
(చివరి అట్ట లోపలి భాగమును చూడుము)

5. బీజమునేనని భూజమె జగమని - బీజమునే భేదించుమురా। బీజముబోయిన భీతియెలేదని - తేజముమీరగ కనుగొనరా ||భా||

6. సూత్రమెనేనని గాత్రమెజగమని - సూత్రమునే ఛేదించుమురా। సూత్ర గాత్రములు శూన్య మయ్యెగురు -సూచనయే పరిపూర్ణమురా ||భా||

7. కృత్రిమ కులమత కృత్రిమ భాష్యము - కూటస్థునిలో కుళ్ళేరా। కూటము రహితంబైనచొ నావల - వైకురంబదె గాంచుమురా ||భా||

8. చిత్తమె క్షేత్రము, క్షేత్రజ్ఞుండన - నేనేయంచును కనుగొనరా। క్షేత్రజ్ఞుండిల బోయిన నావలి - సూత్రంబదె గురుసూచనరా ||భా||

9. ద్వాదశి షోడశిద్వయ మంత్రంబుల - గూఢార్థంబును వినుమిదెరా। ఎరుకే తొలగిన యేదిక జన్మము - యెరిగేవారలు యెవరికరా ||భా||

10. పొన్నాల్ రాజేశ్వరు గురుబోధలు - పూర్ణానందును దీక్షనురా కొండ[illegible]లా వేంకటరెడ్డిటు - కొరిక దీరగ చాటెనురా ||భా||

## శ్రీ శివరామదీక్షిత గురుపీఠ మంగళహారతి

1. శ్రీ కరంబైనట్టి ఓంకార పీఠమున। ప్రాకటంబుగహరికి। భానునకును, ఏకముగవెలిగేటి యాజ్ఞవల్కికి మరియు జోకతో రాజఋషి జనక పతికి। జయమంగళం। నిత్యశుభ మంగళం। జయతు జయమంగళం మహోత్సమంగళం

2. శుద్ధత త్వజ్ఞుడౌ శుకయోగికిని నిత్య। సద్ధర్మ మార్గుడౌ సాందీవునకు। సిద్ధముగ పూర్ణుడౌ శ్రీకృష్ణమూర్తికిని। ఒద్దికతో అర్జున ముద్ధవులకు ||జయ||

3. శ్రీమించి వెలిగేటి శ్రీ [illegible]రస్వామికిని। ధీమించుశివరామ దీక్షితునకు। కాం[illegible]తార్థము లిచ్చుఘన అప్ప బ్రహ్మకు వేమూరు శ్రీ సీత రాములకును ||జయ||

4. పరిపూర్ణబోధను ప్రకట పరచినయట్టి। పరభాగవత కృష్ణ గురునకివుడూ। నిరతంబు పరతత్వ మెరిగించె పీల్లాన పరం[illegible] ప్రభు చరణములకు ||జయ||

5. గురుతుగా ఓంకార గురుపీఠ సిద్ధాంత। పరమతత్వార్థము భక్తులకునూ। కరుణతో బోధించి కడతేర్చునటువంటి వర వేంకటశ్వరా గురునికివుడూ ||జయ||

6. అనుమానములులేక నచలబోధనుదెల్పి। జనన మరణ భ్రాంతి జడువుదీర్చి। పనిబూనుకొని గురుభక్తులను దరిజేర్చు హనుమంత సద్గురు ఆర్యలకును ||జయ||

7. ధరరాజ యోగమున దండిగావిలసిల్లి। శరణార్థులగు సుజన సంఘమునకు। పరిపూర్ణ భోధను కరుణిచే నొసగు శ్రీ వరరాజయార్య సురవందితునకు ||జయ||

8. ప్రస్ఫుటముగను పరిపూర్ణ భావమును ప్రకటపరిచిన బూసనర్సింహార్యునకును। నిరతమ్ము పరతత్వ మెరిగించు మల్లు వెంకటరెడ్డి దేశికునకూ ||జయ||

సద్గురు మహరాజ్‌కి జై

## సూక్తులు :

1. ఉన్నవాణ్ణి వున్న వాడుద్ధరించును - లౌకికము.
2. లేనివాడే వున్నవాణ్ణి వుద్ధరించును - పారమార్థికము.
3. ఉన్నవాణ్ణి లేనివానిగా నుద్ధరించుటకు, ఉండి లేనివాడై వున్నవాణ్ణి వుండి లేనివానిగా జేయును.
4. ఉన్నవాడు లేనివానిగా కాకుండ, వున్నవాణ్ణి లేనివానిగా చేయజాలడు.

ఇందుకు కల మేల్కలు దృష్టాంతములు.

5. నీవే నేనై యుండగ అన్య మెక్కడ - అద్వైత బోధ.
6. అంతా పరిపూర్ణపరబ్రహ్మముండగ నేనెక్కడ - పరిపూర్ణ బోధ.

సర్వం శ్రీ గురు చరణారవిందార్పణ మస్తు

## గ్రంథ ప్రాప్తి స్థానములు

1. గురుగీతా మందిరం ఇ.నెం. 1-7-150/10 బోయపల్లి గేటు దగ్గర, మహబూబ్‌నగర్.
2. శ్రీ ప్రభోదానంద మల్లు వెంకటార్య రాజయోగి ఇ.నెం. 1-4-18/3, రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్. 509 001.